# శ్రీవిద్య

క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క ల హ్రీం।



గ్రంథకర్త :

## స్వామి పరమానందనాథ

**(డా॥ క్రోవి పార్థసారథి)**

**శ్రీవిద్య**


గ్రంథకర్త :

**స్వామి పరమానందనాథ (డా॥ క్రోవి పార్థసారథి)**



ప్రథమ ముద్రణ : &&&, 2009

ప్రతులు : 1000





**మూల్యము : రూ. 000-00**

*ప్రతులకు :*

1. **క్రోవి రమాదేవి**
   23-11/1-10/2, ఓగిరాలవీధి,
   సత్యనారాయణపురం, విజయవాడ-11.
   ఫోన్ : 0866-2530672

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013
   ఫోన్ : 0866-2522824

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.
ఫోన్ : 0866-2574828

# ప్రణతులు

మంత్రశాస్త్రంలో స్త్రీ దేవతను గురించి చెప్పే యంత్ర, మంత్ర, పూజావిధానాలనే 'విద్య' అంటారు. అదే పరదేవత యొక్క యంత్ర, మంత్ర, తంత్ర విధానాలను 'శ్రీవిద్య' అంటారు. ఆ దేవత యొక్క యంత్రము అంటే శ్రీచక్రము మంత్రము అంటే పంచదశి మహామంత్రము. తంత్రము అంటే పూజావిధానము. శ్రీవిద్యను గురించి చెప్పే గ్రంథాలలో కామకలావిలాసము, యోగినీ హృదయము, వామకేశ్వర తంత్రము, సౌందర్యలహరి, సుభగోదయ స్తుతి, లలితాసహస్రము ముఖ్యమైనవి. ఇవి కాక కుళార్ణవ తంత్రము, జ్ఞానార్ణవతంత్రము మొదలైన అనేక తంత్ర గ్రంథాలున్నాయి. ఈ గ్రంథాలన్నీ శ్రీవిద్యను పూర్తిగా వివరిస్తాయి. కాని యోగినీ హృదయము, కామకలావిలాసము మొదలైన గ్రంథాలలోని విషయం అంత తేలికగా అందుబాటులో ఉండదు. ఇక సౌందర్యలహరి, సుభగోదయ స్తుతి, లలితా సహస్రము వంటి పుస్తకాలలో విషయం ఒక క్రమంలో కాక అక్కడ కొంత, అక్కడ కొంత చెప్పబడి ఉంటుంది. వామకేశ్వర తంత్రం కేవలము వామాచారాన్ని వివరించగా, కుళార్ణవ తంత్రం కౌళాచారాన్ని, జ్ఞానార్ణవ తంత్రం సమయాచారాన్ని వివరిస్తాయి. భాస్కరరాయలవారు వ్రాసిన 'వరివస్యారహస్యము' పూర్తిగా పంచదశి మహామంత్రాన్ని వివరిస్తుంది.

ఇవన్నీ కలిసి ఒకచోటికి వస్తే సామాన్య మానవుడికి 'శ్రీవిద్య' అంటే ఏమిటో తెలుస్తుంది. ఇవాళ్టిరోజున 'శ్రీవిద్య' అనే పదం బాగా వినిపిస్తోంది. ఈ పదాన్ని వాడేవారు, దానిలోని విషయం కూడా కొంతవరకయినా ఆకళింపు చేసుకుంటే చాలా ఉపయోగం ఉంటుంది. కాబట్టి అతిసామాన్యుడికి కూడా శ్రీవిద్య అంటే ఏమిటో పూర్తిగా తెలియాలనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథం వ్రాయటం జరుగుతున్నది.

పైన చెప్పిన శ్రీవిద్యాపరమైన గ్రంథాలలో

| | | |
|---|---|---|
| 1. కామకలావిలాసము | - | శ్రీవిద్యాసర్వస్వము |
| 2. యోగినీ హృదయము | - | శ్రీవిద్యాహృదయము |
| 3. సుభగోదయస్తుతి | - | శ్రీవిద్యాదర్పణము |
| 4. సౌందర్యలహరి | - | శ్రీవిద్యాలహరి |
| 5. లలితాసహస్రము | - | శ్రీవిద్యాసారథి |
| 6. వరివస్యా రహస్యము | - | వరివస్యారహస్యము |

అనే పేర్లతో నేను అతితేలికయైన భాషలో వ్రాయటం జరిగింది. ఇప్పుడు వాటిలో చెప్పిన విషయాలన్నింటినీ ఒకచోట కూర్చి, గతంలో చెప్పని విషయాలు, సమయమత రహస్యాలు చేర్చి, అతిసామాన్యుడిని దృష్టిలో ఉంచుకుని, ఈ శ్రీవిద్యా గ్రంథము ప్రచురించటం జరుగుతున్నది. ఇది సర్వోపనిషత్సారము, సర్వదేవతా ప్రీతికరము, సర్వకార్యసిద్ధికరము, మోక్షప్రదాయకము. శ్రీవిద్యోపాసకులంతా తప్పనిసరిగా పూజామందిరంలో ఉంచుకొని చదివి తీరవలసిన గ్రంథమిది. ప్రస్తుతం నేను 1-3-2009 నుంచి సహస్ర చండీయాగం చేస్తున్నాను. ఇది 13-12-2009 దాకా కొనసాగుతుంది. ఈ సమయంలో ఈ గ్రంథాన్ని వ్రాయటం జరుగుతోంది. ఇది కేవలము పరమేశ్వరి ప్రేరణగానే భావిస్తున్నాను.

ఈ గ్రంథంలో ఒకే విషయాన్ని రెండు మూడుసార్లు కూడా సందర్భాన్ని బట్టి చెప్పటం జరిగింది. పాఠకుల సౌలభ్యం కోసం మాత్రమే ఇలా చెప్పటం జరిగింది. అంతేకాని పునరావృత్తి దోషం మాత్రం కాదు.

గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే ఈ గ్రంథాన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ ....

గ్రంథరచనలో నాకు అన్నివిధాల సహకరించిన నా భార్య [illegible] అభినందనలు తెలియజేస్తూ ...

వైశాఖ శుద్ధ దశమి సోమవారము
04-05-2009.

బుధజన విధేయుడు

(శ్రీవి పార్థసారథి)

## స్వామిపరమానందనాథులవారి ఇతర గ్రంథాలు - సి.డి.లు

| | గ్రంథాలు | సి.డి.లు | |
|---|---|---|---|
| 1. | శ్రీవిద్యాసారథి | శ్రీశ్రీశ్రీ గణపతి స్వామివారి జీవిత చరిత్ర | (40 గం॥) |
| 2. | శ్రీకైవల్యసారథి | శ్రీవిద్యాసారథి | (24 గం॥) |
| 3. | శ్రీవిద్యాలహరి | సప్తశతిభాష్యము | (12 గం॥) |
| 4. | శ్రీవిద్యా దర్పణము | లలితారహస్యోపనిషత్తు | (1గం॥) |
| 5. | శ్రీవిద్యా సర్వస్వము | ఉపనిషద్దర్శనము | (12 గం॥) |
| 6. | శ్రీవిద్యా హృదయము | బ్రహ్మసూత్రాలు | (12 గం॥) |
| 7. | శ్రీవిద్యా పంచదశి | దేవీభాగవతము | (12 గం॥) |
| 8. | శ్రీవిద్యా రహస్యము | శివారాధన | (11 గం॥) |
| 9. | శ్రీవిద్యా మహాయంత్రము | సాయిచరితము పారాయణ క్రమం | (12 గం॥) |
| 10. | సప్తశతి భాష్యము | శ్రీవిద్యాలహరి | (18 గం॥) |
| 11. | దేవీ కథాసుధ | విష్ణుసహస్రనామ వివరణ | (12 గం॥) |
| 12. | శ్రీవిద్యా దర్శనము | లలితాసహస్రనామ వివరణ | (12 గం॥) |
| 13. | ఉపనిషత్సర్వస్వము | ఆత్మసాక్షాత్కారము | (10 గం॥) |
| 14. | శ్రీచక్ర సర్వస్వము | శ్రీకృష్ణలీలామృతము | (15 గం॥) |
| 15. | భావనోపనిషత్తు | (శ్రీమద్భాగవత సప్తాహ ప్రవచనాలు) | |
| 16. | త్రిపురా రహస్యదీపిక | సీతారామకళ్యాణము | (1 గం॥) |
| 17. | బ్రహ్మసూత్రమంజరి | శ్రీదత్త చరిత్ర | (10 గం॥) |
| 18. | శ్రీచక్రము | శ్రీ గాయత్రీ మహామంత్రము | (10 గం॥) |
| 19. | తొలి ఏకాదశి | గురుతత్త్వము | (9 గం॥) |
| 20. | లలితారహస్యోపనిషత్తు | శ్రీసూక్త భాష్యము | (1 గం॥) |
| 21. | ఆత్మసాక్షాత్కారము | త్రిపురారహస్యము | (45 గం॥) |
| 22. | శ్రీచక్రసర్వస్వము | రామాయణకథాసుధ | (172 గం॥) |
| 23. | వరివస్యా రహస్యము | గురుగీత | (17 గం॥) |
| 24. | గురుతత్త్వము | ఉద్ధవగీత | (17 గం॥) |
| 25. | శ్రీవిద్య | శ్రీచక్రము | (4 గం॥) |

## విషయసూచిక



డా॥ క్రోవి పార్థసారథి గారికి స్వర్ణకంకణాన్ని బహూకరిస్తున్న
శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామివారు



'శ్రీవిద్యాసారథి' గ్రంథావిష్కరణ సందర్భంగా
గ్రంథకర్తను 'గండపెండేరము'తో సత్కరిస్తున్న
ఉమా చిట్‌ఫండ్స్ అధినేత శ్రీ కాండూరి ఉమామహేశ్వరుడు గారు.



5-9-2004నడా॥ క్రోవి పార్థసారథిగారిని రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయునిగా సత్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వైఎస్. రాజశేఖరరెడ్డిగారు



21-3-2004నడా॥ క్రోవి పార్థసారథిగారికి రాష్ట్రప్రభుత్వముచేతారణనామ సంవత్సర ఉగాది



డా॥ క్రోవి పార్థసారథిగారికి ఆంధ్రప్రదేశ్ శాసనసభస్పీకర్ శ్రీ డి.శ్రీపాదరావుగారిచేసన్మానము



28-1-2006న డా॥ క్రోవి పార్థసారథిగారికి 'కృష్ణా మహోత్సవ్'లో సత్కారము

## క్రోవి పార్థసారథిగారి పరిచయం

| | | |
|---|---|---|
| పూర్తిపేరు | : | క్రోవి పార్థసారథి |
| తల్లిదండ్రులు | : | సత్యపర్వత వర్ధనమ్మ, కృష్ణమూర్తి |
| గోత్రము | : | హరితస |
| దీక్షా నామము | : | పరమానందనాథ |
| వృత్తి / ఉద్యోగము | : | రిటైర్డ్ వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకులు, శాతవాహన కళాశాల, విజయవాడ. |
| ఇంటి అడ్రస్ | : | 23-11/1-10/2, దేవీ నిలయం, ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం, విజయవాడ-520 011.ఫోన్ : 2530672 |

**రచించిన గ్రంథాలు :**

1. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రానికి విశేష వ్యాఖ్య)
2. శ్రీకైవల్యసారథి (విష్ణు సహస్రానికి విశేష వ్యాఖ్య)
3. శ్రీవిద్యాలహరి (సౌందర్యలహరికి విశేష వ్యాఖ్య)
4. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయస్తుతికి వ్యాఖ్య)
5. శ్రీవిద్యా సర్వస్వము (పుణ్యానంద మునీంద్రుల కామకలా విలాసానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా హృదయము (యోగినీహృదయానికి వ్యాఖ్య)
7. శ్రీవిద్యా పంచదశి (పంచదశి మహామంత్రానికి వివరణ)
8. శ్రీవిద్యా రహస్యము
9. శ్రీవిద్యా మహాయంత్రము (శ్రీచక్రానికి విశేషవ్యాఖ్య)
10. సప్తశతి భాష్యము
11. దేవీ కథాసుధ
12. శ్రీవిద్యా దర్శనము
13. ఉపనిషత్సర్వస్వము (దశోపనిషత్తుల మీద కథలు)
14. శ్రీచక్ర సర్వస్వము
15. భావనోపనిషత్తు
16. త్రిపురా రహస్యదీపిక
17. బ్రహ్మసూత్రమంజరి
18. శ్రీచక్రము
19. తొలి ఏకాదశి
20. శివపురాణము
21. సర్వదేవతా హోమవిధానము
22. లలితారహస్యోపనిషత్తు
23. ఆత్మసాక్షాత్కారము
24. వరివస్యా రహస్యము
25. శ్రీవిద్య

**ప్రవచించిన సి.డి.లు :**

| | | |
|---|---|---|
| 1. | గణపతిస్వామి వారి జీవిత చరిత్ర | (40 గం॥) |
| 2. | శ్రీవిద్యాసారథి (లలితారహస్యనామ భాష్యము) | (24 గం॥) |
| 3. | సప్తశతిభాష్యము | (12 గం॥) |
| 4. | లలితారహస్యోపనిషత్తు | (1గం॥) |
| 5. | ఉపనిషద్దర్శనము | (12 గం॥) |
| 6. | బ్రహ్మసూత్రాలు | (12 గం॥) |
| 7. | దేవీభాగవతము | (12 గం॥) |
| 8. | శివారాధన | (11 గం॥) |
| 9. | శ్రీచక్రము | (4 గం॥) |
| 10. | సాయిచరితము పారాయణ క్రమం | (12 గం॥) |
| 11. | శ్రీవిద్యాలహరి (సౌందర్యలహరి) | (18 గం॥) |
| 12. | శ్రీ కైవల్యసారథి (విష్ణుసహస్రనామ వివరణ) | (12 గం॥) |
| 13. | లలితాసహస్రనామ వివరణ | (12 గం॥) |
| 14. | ఆత్మసాక్షాత్కారము | (10 గం॥) |
| 15. | శ్రీకృష్ణలీలామృతము | (15 గం॥) |

(శ్రీమద్భాగవత సప్తాహ ప్రవచనాలు)

| | |
|---|---|
| 16. సీతారామకళ్యాణము | (1 గం॥) |
| 17. గురుగీత | (17 గం॥) |
| 18. గాయత్రీ మహామంత్రము | (9 గం॥) |
| 19. గురుతత్త్వము | (9 గం॥) |
| 20. త్రిపురా రహస్యము | (45 గం॥) |
| 21. గీతామహాయజ్ఞము | (72 గం॥) |
| 22. రామాయణ కథా సుధ (7 కాండలు) | (172 గం॥) |
| 23. శ్రీసూక్త భాష్యము | (1 గం॥) |

**సత్కారాలు** : 1. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ఉగాది పురస్కారము 21-3-2004

2. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము 5-9-2004
3. మైసూర్ అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియామకము 29-5-2005
4. కృష్ణాజిల్లా కలెక్టర్ వారిచే సత్కారము 15-8-2005
5. కృష్ణా మహోత్సవములో పండితునిగా సత్కారము 28-1-2006
6. శాతవాహన కళాశాల యాజమాన్యముచే ఉత్తమ ఉపాధ్యాయునిగా సత్కారము 23-2-2005
7. శాతవాహన కళాశాల యాజమాన్యముచే రజిత పతకము బహూకరణ 5-2-2002
8. శాతవాహన కళాశాల సెక్రటరీ శ్రీ అండవల్లి సత్యనారాయణ గారిచే రూ. 500 లు నగదు బహూకరణ
9. గణపతిస్వామివారిచే నవరత్న ఉంగరము బహూకరణ 11-1-2004
10. కనకాభిషేకము 13-12-1999
11. సువర్ణ ఘంటాకంకణ ప్రదానము 1-8-1998
12. గండపెండేర ప్రదానము 3-11-2002

**బిరుదులు** : 1. చక్రవిద, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి.

**సన్మానాలు** : 1. గుజరాత్ గవర్నర్ శ్రీ నావల్ కిశోర్ శర్మ గారిచే

2. కర్నాటక గవర్నర్ శ్రీ టి.ఎన్. చతుర్వేది గారిచే
3. శ్రీ డి.పాదరావు ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎస్సెంబ్లీ స్పీకర్ గారిచే
4. జనాబ్ యం.కె. బేగ్ (రాష్ట్ర టెక్నికల్ విద్యాశాఖామాత్యులు) గారిచే
5. శ్రీ దేవినేని రాజశేఖర్ (నెహ్రూ) (రాష్ట్ర టెక్నికల్ విద్యాశాఖామాత్యులు) గారిచే
6. శ్రీ జలగం ప్రసాదరావు, మాజీమంత్రివర్యులచే
7. శ్రీ ఉపేంద్ర, మాజీ కేంద్రమంత్రివర్యులచే
8. రసభారతి (సాహిత్య సంస్థ) వారిచే 8-4-2003
9. భారత వ్యవసాయ పారిశ్రామిక ఎగ్జిబిషన్ సొసైటీ వారిచే
10. అవధూత దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి
11. కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతిస్వామి
12. గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతి స్వామి
13. గుంటూరు శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివకళ్యాణానంద భారతి మహాస్వామి
14. విశ్వబంధు తపోవనం ట్రస్ట్ అధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి
15. చైతన్యతపోవనం ట్రస్ట్ అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య
16. కాళీగార్డెన్స్ అధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రకాళీ ప్రసాదమాతాజీ
17. విజయవాడ లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మాతా శివలీల

## వంశాదికములు

కృష్ణాజిల్లా దివితాలూకా చోడవరం గ్రామకాపురస్తులు భారద్వాజస గోత్రీకులు మేడిచర్ల చల్లయ్యశాస్త్రి గారు.

ఆయనకు నలుగురు కుమారులు.

1. సత్యనారాయణగారు 3. దక్షిణామూర్తిగారు

2. చంద్రశేఖరంగారు 4. రామ్మూర్తి అవధాని గారు

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి వేమూరి రాజేశ్వరి గారు 2. శ్రీమతి ఈమని సీతామహాలక్ష్మి గారు

మేడిచర్ల సత్యనారాయణ గారి కుమారుడు ఆంజనేయశాస్త్రి గారు. భార్య శ్రీమతి రామలక్ష్మిగారు కుమార్తెలు శ్రీమతి క్రోవి సత్యపర్వత వర్ధనమ్మగారు, భర్త కృష్ణమూర్తిగారు శ్రీమతి శిష్ట్లా పద్మావతి గారు. భర్త రామసత్యనారాయణగారు, శ్రీమతి క్రోవి సత్యపర్వత వర్ధనమ్మగారి జ్యేష్ఠకుమారుడు క్రోవి పార్థసారథి.

2. గుంటూరుజిల్లా కొల్లూరు గ్రామకాపురస్తులు శ్రీవత్సస గోత్రీకులు కూచిభొట్ల నాగభూషణ శాస్త్రిగారు. వీరికి నలుగురు కుమారులు

1. నారాయణశాస్త్రిగారు 3. లక్ష్మీనృశింహశాస్త్రి గారు

2. ప్రభాకరశాస్త్రి గారు 4. వీరరాఘవశాస్త్రి గారు

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి మేడిచర్ల బాలాత్రిపురసుందరి గారు 2. శ్రీమతి కుందుర్తి శకుంతలమ్మ గారు

శ్రీమతి బాలాత్రిపుర సుందరి గారి పెద్దకుమార్తె శ్రీమతి సత్యపర్వత వర్ధనమ్మగారు. భర్త కృష్ణమూర్తిగారు వారి జ్యేష్ట కుమారుడు క్రోవి పార్థసారథి

కూచిభొట్ల లక్ష్మీనృశింహశాస్త్రి గారు ఘట్టివారికి పెంపుడు వెళ్ళారు. తరువాత కాలంలో సన్యసించి శ్రీశ్రీశ్రీ కళ్యాణానందభారతి తరువాత గుంటూరులోని శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠానికి నృశింహానంద భారతి పేరుతో అధిపతులయినారు.

పార్థసారథి గారి మాతామహుని వంశంలో అందరూ శ్రీవిద్యోపాసకులే.

3. ప్రకాశంజిల్లా ఒంగోలు కాపురస్తులు కౌశికస గోత్రీకులు. వారణాసి వేణుగోపాల కృష్ణయ్యగారు. వారి కుమారుడు, రమాకాంతశర్మ గారు. భార్య శ్రీమతి అన్నపూర్ణమ్మగారు కుమార్తె శ్రీమతి పిల్లుట్ల సరోజినీదేవి గారు. భర్త రాధాకృష్ణమూర్తిగారు.

రమాకాంతశర్మ గారికి ఇద్దరు కుమారులు

1. వెంకట శ్రీధర్ భార్య శ్రీమతి మాధవి 2. మురళీకృష్ణ భార్య శ్రీమతి హిమబిందుకాగా ఒక కుమార్తె. శ్రీమతి రమాదేవి. ఆమె భర్త క్రోవి పార్థసారథి.

4. గుంటూరు జిల్లా బాపట్ల వాస్తవ్యులు శ్రీవత్సస గోత్రీకులు పిల్లుట్ల వెంకట సుబ్బయ్య గారు. వారికి ఇద్దరు కుమారులు.

1. చిరంజీవి శర్మగారు భార్య శ్రీమతి రామలక్ష్మిగారు 2. శివావధానిగారు భార్య శ్రీమతి విజయశ్రీగారు

ముగ్గురు కుమార్తెలు

1. శ్రీమతి గండికోట లక్ష్మీనరసమ్మగారు భర్త ఆది శేషగిరిరావు గారు

(వీరి కుమారుడే ప్రఖ్యాత పారిశ్రామికవేత్త అన్నపూర్ణా గ్రూప్ సంస్థల అధినేత అయిన శ్రీ గండికోట రఘురామశర్మ గారు)

2. శ్రీమతి వారణాసి అన్నపూర్ణమ్మ గారు భర్త రమాకాంతశర్మ గారు

3. శ్రీమతి పెద్దిభొట్ల హనుమాయమ్మ గారు భర్త సుబ్బరామయ్య గారు (ప్రముఖ కథారచయిత)

శ్రీమతి వారణాసి అన్నపూర్ణమ్మ గారి కుమార్తె శ్రీమతి రమాదేవి. రమాదేవి గారి భర్త క్రోవి పార్థసారథి.

5. కృష్ణాజిల్లా దివితాలూకా విశ్వనాథపల్లె గ్రామకాపురస్తులు జొన్నవిత్తుల కృష్ణయ్య గారు ఆయనకు నలుగురు కుమారులు.

1. సీతారామయ్య గారు 3. పద్మనాభం గారు

2. ఆదినారాయణ గారు 4. సూర్యనారాయణ గారు కాగా

1. శ్రీమతి క్రోవి లక్ష్మీనరసమ్మ గారు

2. శ్రీమతి జొన్నలగడ్డ సీతారావమ్మగారు

3. శ్రీమతి నిమ్మగడ్డ అన్నపూర్ణమ్మ గారు

4. శ్రీమతి లంక నాంచారమ్మ గారు

5. శ్రీమతి ద్వైతా వెంకట లక్ష్మీగారు కుమార్తెలు

శ్రీమతి క్రోవి లక్ష్మీనరసమ్మ గారి భర్త పురుషోత్తమశర్మగారు వీరి ఏకైక సంతానం క్రోవి కృష్ణమూర్తి గారు. ఆయన జ్యేష్ఠ పుత్రుడు క్రోవి పార్థసారథి.



6. కాకినాడ వాస్తవ్యులు హరితస గోత్రీకులు క్రోవి గోపాల సోమయాజులు గారు. ఆయనకు ఇద్దరు కుమారులు

1. నాగేశ్వర సోమయాజులు గారు 2. బాలకృష్ణ సోమయాజులు గారు

వీరిలో బాలకృష్ణ సోమయాజులు గారికి ఇద్దరు కుమారులు.

1. పురుషోత్తమ దీక్షితులు గారు 2. లక్ష్మీనారాయణ సోమయాజి గారు

పురుషోత్తమ దీక్షితులుగారికి ఐదుగురు కుమారులు

1. నాగేశ్వర సోమయాజి గారు 4. లక్ష్మీనారాయణ గారు

2. సుందరం గారు 5. రామ్మూర్తి గారు

3. దక్షిణామూర్తి గారు

వీరిలో నాల్గవవారైన లక్ష్మీనారాయణ గారి కుమారుడు పురుషోత్తమ శర్మగారు. భార్య శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు వారి కుమారుడు కృష్ణమూర్తి గారు. వారికి ముగ్గురు కుమారులు.

1. పార్థసారథి భార్య శ్రీమతి రమాదేవి వీరికి ఇద్దరు కుమార్తెలు.

1. శ్రీమతి గునుపూడి శైలజ భర్త డా॥ పవన్ కుమార్, వీరి కుమార్తెలు 1. ధాత్రి 2. మైత్రి 3. కీర్తి

2. శ్రీమతి రాపాక మంజూష భర్త సత్యవేంకట శ్రీధర్ కాగా కుమారుడు కృష్ణకాంత్ శర్మ

2. రామారావు భార్య శ్రీమతి డా॥ భారతలక్ష్మి వీరి కుమార్తెలు 1.ప్రియాంక, 2. శ్వేత

3. విజయ కుమార్ భార్య శ్రీమతి పద్మావతి వీరి కుమారుడు శ్రీకృష్ణ చైతన్య కుమార్తె హిమబిందు

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి గునుపూడి గిరిజ కుమారి భర్త నాగేశ్వరరావు గారు (ఫైనాన్షియల్ డైరక్టర్, హైదరాబాద్ వాటర్ వర్క్స్)

2. శ్రీమతి కూనపులి శారద భర్త భాస్కరమూర్తి గారు

కృష్ణమూర్తి గారి జ్యేష్ఠకుమారుడు క్రోవి పార్థసారథి



7. కృష్ణాజిల్లా బందరు (మచిలీపట్నం) కాపురస్తులు లంక లక్ష్మీనారాయణగారి కుమారుడు వెంకట్రామయ్యగారు. వీరంతా శ్రీవిద్యోపాసకులే. వీరి దౌహిత్రుడు క్రోవి పురుషోత్తమ శర్మగారు. చిన్నప్పడే తల్లిని పోగొట్టుకుని తాతగారికి వారసుడైనాడు. ఈ రకంగా బందరు వాస్తవ్యుడైన పురుషోత్తమ శర్మగారి మనుమడు క్రోవి పార్థసారథి గారు వృత్తిరీత్యా ప్రస్తుతం విజయవాడ శాతవాహన కళాశాలలో వాణిజ్య శాస్త్ర విభాగంలో రీడరుగా పనిచేసి 31-12-2007న రిటైరైనారు.

# శ్రీవిద్య

## 1. శ్రీవిద్య అంటే ఏమిటి ?

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశర చాపపాశాంకుశాం**
**అశేషజనమోహినీం అరుణమాల్య భూషాంబరాం**
**జపాకుసుమభాసురాం జపనిధౌ స్మరేదంబికాం ॥**

నుదుటన కస్తూరి తిలకము ధరించినది, చిరునగవు చిందించునది, పాశము, అంకుశము, ధనుర్బాణములు చేతులయందు ధరించినది, లోకాలన్నింటినీ మోహింపచేయునది, ఎఱ్రనివస్త్రములు ధరించినది, మంకెన్నపువ్వువలె పాటలవర్ణము గలది అయిన పరమేశ్వరిని ధ్యానించుచున్నాను.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతని ప్రతిరూపమే పరమేశ్వరి. సృష్టి ప్రారంభంకాకముందు పరమేశ్వరుడు బిందురూపంలో ఉండేవాడు. తనలో లీనమై ఉన్న జీవులయొక్క కర్మను క్షయంచేసి వారికి మోక్షం కలిగించాలనే కోరికతో 'సృష్టిచెయ్యాలి' అని సంకల్పించాడు. అప్పుడు తన నుండి కొంతభాగాన్ని బయటకు పంపాడు. అదే శక్తి. త్రికోణరూపిణి. ఇప్పుడు

**త్రికోణరూపిణీ, శక్తిః. బిందురూపపర శ్శివః** త్రికోణమే శక్తి. కాగా బిందువు శివుడు. వీరిద్దరూ వేరువేరుగా ఉండరు. కలిసే ఉంటారు. శివుడు లేకుండా శక్తిగాని, శక్తి లేకుండా శివుడుగాని ఉండరు. **త్రికోణే బైందవంశ్లిష్టం.** త్రికోణంలో బిందువుంటుంది. ఈ త్రికోణం నుంచే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

'త్రికోణం' అంటే యోని. అదే జన్మస్థానం. స్థావర జంగమాత్మకమైన జగత్తు అంతా ఈ త్రికోణం నుంచే వచ్చింది. ఆ త్రికోణమే పరమేశ్వరి రూపం. ఆ

పరమేశ్వరియే లలితాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, కామేశ్వరి అని పిలువబడుతుంది. ఆవిడే పరాశక్తి. ఆవిడే పరమేశ్వరి. అమ్మలగన్నయమ్మ. జగన్మాత. శ్రీమాత. **ఆమెను గురించి చెప్పే విషయమే శ్రీవిద్య.**

**మననాత్త్రాయత ఇతి మంత్రః** మననము చెయ్యటంవలన, మననము చేసేవాడిని రక్షించేది మంత్రము. మననము అంటే ఒకే అక్షరాన్ని, ఒకే మాటని, ఒకే పదాన్ని లేదా ఒకే వాక్యాన్ని పదేపదే స్మరించటాన్నే మననము అంటారు. ఇలా మననం చెయ్యటంవల్ల కొంత శక్తి పుడుతుంది. ఆ శక్తి మననము చేసేవాడిని రక్షిస్తుంది. సర్వశక్తి సంపన్నులైన దేవతలను ప్రసన్నులుగా చేసుకోవటానికి మంత్రాన్ని ఉపాసించటం జరుగుతుంది. అయితే ఉపాసనాక్రమంలో పురుషదేవతలను ఉపాసించే వాటిని మంత్రాలు అని, స్త్రీ దేవతల ఉపాసనకు ఉపయోగించే మంత్రాలను 'విద్య' అని అంటారు. ఇక్కడ శ్రీవిద్య అనే పదంలో 'శ్రీ' అనే అక్షరం విద్యకు విశేషణంగా చెప్పబడింది. **శ్రీ యన లక్ష్మి, శ్రీ యన గౌరి, శ్రీ యన సరస్వతి** శ్రీ అంటే లక్ష్మి, శ్రీ అంటే సరస్వతి, శ్రీ అంటే పార్వతి ఇలా చూసినట్లైతే ఈ సృష్టికి మూలమైనవారు త్రిశక్తులు. వారే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు. మానవుడు జీవించటానికి కావలసిన సిరిసంపదలనిచ్చేది లక్ష్మి, శౌర్య పరాక్రమాలనిచ్చేది కాళి, విజ్ఞానాన్నిచ్చేది సరస్వతి. ఇటువంటి త్రిశక్తులను సృష్టించినది ఆదిపరాశక్తి. వీరంతా ఆ దేవియొక్క అంశలే. అందుకే ఆమెను **'ముగురమ్మల మూలపుటమ్మ'** అంటారు. సర్వశక్తిమయమైనది ఆ దేవి. ఈ జగత్తులో ఏం కావాలన్నా ఇచ్చే శక్తి ఆ తల్లికి ఉన్నది. ఈ జగత్తులోనే కాదు. ఆ తరువాత కూడా మన కోరికలు తీర్చగలిగేది ఆ దేవత. ఆమెను గనక అర్చించినట్లైతే ఇహపరాలు అన్నీ ఒనగూడతాయి. ఇహము అంటే ఈ లోకంలో సుఖంగా జీవించటానికి అవసరమైన సిరిసంపదలు, భోగభాగ్యాలు. పరము అంటే మరణానంతరము పొందే స్వర్గము, మోక్షము. సామాన్యంగా మానవుడికి ఇహం అంటే సిరిసంపదలు. భోగభాగ్యాలు కావాలంటే పరాన్ని వదిలెయ్యాలి. అలాగే మోక్షం కావాలంటే ఈ లోకంలో పొందే సుఖాలను వదిలెయ్యాలి. అయితే పరమేశ్వరిని అర్చించే వారికి ఇహం కావాలంటే ఇహం, పరం కావాలంటే పరం, ఏది కావాలంటే అది వస్తుంది. అందుకే

**శ్రీసుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థయేవ**



అన్నారు. ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే దేవతలు మన కోరికలు తీర్చగలుగుతారు. కాని మోక్షాన్ని ఇవ్వలేరు. అలాగే శాశ్వతత్త్వాన్ని కూడా ఇవ్వలేరు. హిరణ్యకశ్యపుడు, మహిషాసురుడు ఇలా అనేకమంది రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేసి 'చావు లేకుండా వరం కావాలి' అన్నారు. 'అది మాత్రం కుదరదు. నాచేతకాదు. ఆ వరం మాత్రం నేను నివ్వలేను. ఇంకేదైనా వరం కోరుకోండి' అన్నాడు బ్రహ్మ. ఎందుకని ? ఎవరైనా వచ్చి మనల్ని వంద రూపాయలు అడిగారు అనుకోండి. ఆ వందరూపాయలు ఇచ్చే శక్తి మనకు ఉండాలి కదా ! మన దగ్గర అవిలేవు. అలాంటప్పుడు వాళ్ళకి మనం ఏ రకంగా ఇవ్వగలం? అదే బ్రహ్మదేవుడి పరిస్థితి. అతనికే శాశ్వతత్త్వం లేదు. కల్పాంతాన బ్రహ్మకూడా పరబ్రహ్మలో లీనమైపోతాడు. అంతే కాని ఆయన శాశ్వతం కాదు. ఈ కారణంచేతనే రాక్షసులకు శాశ్వతత్త్వాన్ని ప్రసాదించటం తనకు చేతకాదు అన్నాడు. దేవతని ఉపాసించేటప్పుడు ఆ దేవత లక్షణాలు మనక్కూడా వస్తాయి. సాకారమైన దేవతను ఉపాసిస్తే ఆ దేవత లక్షణాలు వస్తాయి. మరి నిరాకారమైన పరమేశ్వరిని ఉపాసించినట్లైతే ఆ లక్షణాలు వస్తాయి. అంటే మోక్షం వస్తుందన్నమాట. కాబట్టి మోక్షం కావాలంటే ఆ పరమేశ్వరినే అర్చించాలి. ఆమె ఏదైనా ఇవ్వగల సమర్థురాలు. అటువంటి **పరమేశ్వరిని ప్రసన్నం చేసుకోవటానికి ఉపయోగించే మంత్ర, యంత్ర, తంత్రాలనే 'శ్రీవిద్య' అంటారు.** ఇంతకీ ఈ పరమేశ్వరి ఎవరు ? ... ఆమెని గురించి, ఆవిడ తత్త్వాన్ని, మంత్ర, యంత్ర, తంత్రాలను గురించి చెప్పే ఉపనిషత్తులు తొమ్మిది ఉన్నాయి. అవి

1. త్రిపురోపనిషత్తు
2. త్రిపురతాపినీ ఉపనిషత్తు
3. దేవీ ఉపనిషత్తు
4. బహ్వృచోపనిషత్తు
5. భావనోపనిషత్తు
6. సరస్వతీ ఉపనిషత్తు
7. సీతోపనిషత్తు
8. సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు
9. లలితా రహస్యోపనిషత్తు

అథర్వణవేదాంతర్గతమైన 'దేవీఉపనిషత్తు'లో ఈ విధంగా ఉన్నది. పూర్వకాలంలో దేవతలంతా ఆ పరమేశ్వరి దగ్గరకు వెళ్ళి "అమ్మా నువ్వెవరవు?"

అని అడిగారు. అప్పుడు ఆమె "నేను బ్రహ్మస్వరూపిణిని. నావల్లనే ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము, ఆనందము, దుఃఖము, జ్ఞానము, అజ్ఞానము, అంతా నేనే. ఈ జగత్తులో పంచభూతాలు నేనే. వేదము నేనే, అవేదము నేనే. అఖిలజగత్తు నేనే, విద్య నేనే, అవిద్య నేనే. క్రింది భాగము, పైభాగము, మధ్యభాగము అంతా నేనే. నేను రుద్రులలో ఉంటాను. ఆదిత్యులలో ఉంటాను. వసువులలో ఉంటాను. విశ్వేదేవతలలో ఉంటాను. ఇంద్రుడు, అగ్ని, అశ్వనీ దేవతలు, త్వష్ట, పూష, భగుడు మొదలయిన వారందరినీ నేనే ధరిస్తున్నాను. విష్ణువు, వామనుడు, ప్రజాపతి, బ్రహ్మ వీరందరినీ ధరిస్తాను. నాకు కారణము నేనే." అంటుంది. **ఆవిడ పరమేశ్వరి.**

తారకాసురసంహారం కోసం దేవతలంతా హిమాలయాలకు వెళ్ళి ఆమెను గురించి తపస్సు చేశారు. వివిధ రకాలుగా అర్చించారు, ఆరాధించారు, పూజించారు. చివరకు చైత్రశుద్ధ నవమి శుక్రవారం నాడు ఆమె వారికి దర్శనం ఇచ్చింది. అప్పుడు ఆమె ఎలా ఉన్నది అంటే

**కోటి సూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**
**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః ।**
**నైవచోర్ధ్వం నతిర్యక్చ నమధ్యేపరిజగ్రభత్**
**ఆద్యంతరహితం తత్తునహస్తాద్యంగ సంయుతం ।**
**న స్త్రీరూప మథవాన పుంరూప మథోభయమ్ ॥**

ఆమెను రూపుదాల్చిన నాలుగు వేదాలు స్తుతి చేస్తుండగా, కోట్లకొలది సూర్యుల యొక్క కాంతులతో, చంద్రులయొక్కచల్లదనంతో, ఆ రూపము కొన్ని కోట్ల మెరుపుతీగలు ఒక్కసారి వచ్చినట్లుగా తళుక్కున్న మెరిసింది. దానికి పైన, క్రింద, అడ్డము అనే తేడా లేదు. ఆద్యంతాలు లేవు. కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేవు. స్త్రీ, పురుష, నపుంసక భేదం లేదు.

ఆ కాంతిని చూడలేక దేవతలు ఒక్కసారిగా కళ్ళు మూసుకుని "తల్లీ ! నీ తేజోరూపాన్ని మేము చూడలేము. కాబట్టి మాకు తెలిసిన రూపంతో ప్రత్యక్షము కావలసింది" అని వేడుకున్నారు. అప్పుడు మంచి యవ్వనంలో ఉన్న అందమైన కన్యగా నాలుగు చేతులతో వారికి దర్శనమిచ్చింది. ఆమె పరమేశ్వరి.



మధుకైటభ సంహారం జరిగిన తరువాత ఒక దివ్యమైన విమానం త్రిమూర్తులను ఎక్కించుకుని ఒక ద్వీపానికి తీసుకుపోతుంది. అక్కడ శ్రీచక్రమువంటి ఆసనం మీద ఒక స్త్రీ మూర్తి వారికి దర్శనమిస్తుంది. త్రిమూర్తులు ఆమెను పరిపరి విధాల స్తుతించిన తరువాత బ్రహ్మదేవుడు "అమ్మా ! నీవు స్త్రీవా ? పురుషుడవా ? **ఏకమేవా ద్వితీయం బ్రహ్మ** అనే వాక్యానికి అర్థం నీవేనా? వివరించవలసింది" అన్నాడు దానికి ఆ పరాశక్తి –

"ఉపాధి భేదంవల్ల రెండు విధాలయినట్లుగా అద్దంలో కనిపించే ప్రకృతిలాగా క్రియాసమయంలో భిన్నత్వం కనిపించినా, పరమావస్థయందు బ్రహ్మపదార్థం ఒక్కటే. దానికి వైవిధ్యంలేదు. సృష్టిసమయంలోగాని, ప్రళయకాలమందుగాని నాకు స్త్రీ, పురుష, నపుంసక భేదాలు లేవు. ఈ సృష్టిలో నాకన్న వేరైన పదార్థం ఏదీలేదు.

ఈ జగత్తులో బుద్ధి, మతి, ధృతి, శ్రీః, శ్రద్ధ, మేధ, దయ, లజ్జ, కాంతి, నిద్ర అంతా నేనే. పర, పశ్యంతి, మధ్యమా, వైఖరీ మొదలైన వాగ్రూపాలు నేనే. బ్రాహ్మి మొదలైన అష్టమాతృకలు నేనే మంచులోని చల్లదనాన్ని నేనే. అగ్నిలోని వేడిని నేనే. సూర్యునిలోని తేజస్సునూ నేనే. నేను లేనిది ఏదీ లేదు. ఈ జగత్తంతా నానుంచే ఆవిర్భవించింది." అని చెబుతుంది. **ఆవిడ పరమేశ్వరి.**

సుధాసాగరం మధ్యలో, మణిద్వీపంలో చింతామణి గృహంలో శ్రీచక్రాకారమైన ఆసనమునందు భువనేశ్వరుడు కూర్చుని ఉంటాడు.

**వామాంకే షణ్ణిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**
**నవరత్నగణాకీర్ణా కాంచీదామ విరాజితా**
**తప్తకాంచన సన్నద్ధా వైడూర్యాంగదభూషణా**

ఆ భువనేశ్వరుని యొక్క వామాంకము మీద, సకలాభరణ భూషితయై కూర్చుని ఉంటుంది. ఆవిడ పరమేశ్వరి. ఆమెను గురించి చెప్పే మంత్ర, యంత్ర, తంత్ర శాస్త్రము అంతా 'శ్రీవిద్య' అనబడుతుంది.

ఇంతకీ అసలు ఈ పరమేశ్వరి ఎవరు ? ఈ విషయం తెలుసుకోవాలంటే ఒక్కసారి దేవీ భాగవతంలోకి వెళ్ళాలి. అందులో ఒక చిన్న కథ ఉంది.

కృతయుగానికి ముందు అంటే సృష్టిజరగటానికి పూర్వం ఈ జగత్తంతా జలమయంగా ఉండేది. ఆ జలరాసిమధ్య వటపత్రశాయి అయిన శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో ఉన్నాడు. ఆయన నాభినుంచి ఒక కమలం వచ్చింది. అందులో నుంచి బ్రహ్మదేవుడు పుట్టాడు. ఈ రకంగా ఉద్భవించిన బ్రహ్మదేవుడు, తాను ఏరకంగా పుట్టాను అని ఆలోచిస్తుండగా, 'తప, తప' అని వినిపించింది. దాని ప్రకారం తాను పుట్టినపద్మంలోనే కూర్చుని తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు. ఇలా వెయ్యిసంవత్సరాలు గడిచాయి. విష్ణుమూర్తి చెవిలోని మలినపదార్థం నుంచి మధుకైటభులు అనే రాక్షసులు జన్మించి బ్రహ్మదేవునితో యుద్ధానికి సిద్ధపడ్డారు. ఎట్టకేలకు పరమేశ్వరి సాయంతో మధుకైటభ సంహారం చేశాడు విష్ణుమూర్తి. అప్పుడు త్రిమూర్తులలో మూడవవాడైన రుద్రుడుకూడా అక్కడికి వచ్చాడు. ఆ సమయంలో ఆకాశంనుండి దివ్యమైనవిమానం ఒకటి వచ్చి త్రిమూర్తులను అందులో ఎక్కించుకుని బయలుదేరింది. అలా ఆ విమానం సప్త సముద్రాలు దాటి మణిద్వీపం చేరింది. అందులో కల్పవృక్షాలవనం. ఆవనం మధ్యన చింతామణులతో నిర్మించిన భవనం, అందులో త్రికోణాకార మంచం మీద ఒక దివ్యమంగళవిగ్రహం. ఎర్రని వస్త్రాలు ధరించి, ఎర్రచందనము శరీరానికి పూసుకుని, సర్వాలంకృతయై, కోట్లకొలది సూర్యుల కాంతులతో ప్రకాశిస్తున్నది ఆవిడ. ఆమె కూర్చున్నది శ్రీచక్రము మీద. ఆమె చేతులలో పాశము, అంకుశము, ధనుర్బాణాలు ఉన్నాయి. దేవతలందరూ ఆమెకు సపర్యలు చేస్తూ, హృల్లేఖీ, భువనేశీ అని జపిస్తున్నారు. అక్కడ తిరుగాడే శుకశారికాలు కూడా హ్రీంకార జపం చేస్తున్నాయి. **ఆవిడే పరమేశ్వరి.** ఆవిడే జగన్మాత.

**హ్రీంకారాసన గర్భితా నలశిఖాం సౌః క్లీం కళాబిభ్రతీం**
**సౌవర్ణాంబరధారిణీం పరసుధాం ధౌతాం త్రినేత్రోజ్వలాం ।**
**వందే పుస్తకపాశ మంకుశధరాం స్రగ్భూషితా ముజ్వలాం**
**త్వాం గౌరీం త్రిపురాం పరాత్పర కళాం శ్రీచక్రసంచారిణీం ॥**

త్రిమూర్తులు ముగ్గురూ ఆమెను పరిపరివిధాల స్తుతి చేశారు. ఆ తరువాత బ్రహ్మదేవుడు – తల్లీ ! నీవు స్త్రీవా ? లేక పురుషుడవా? ఏకమేవా ద్వితీయం బ్రహ్మ అన్న వేదవాక్యానికి అర్థం నీవేనా ? మాకు వివరించవలసినది అన్నాడు. దానికి ఆ పరాశక్తి.



"త్రిమూర్తులారా ! నేనే పరాశక్తిని. పరబ్రహ్మ స్వరూపాన్ని. నాకు నామరూపాలు లేవు. లింగభేదాలు లేవు. ఈ చరాచరజగత్తంతా నాచేతనే సృష్టించబడింది. సర్వకర్తను, సర్వభోక్తను కూడా నేనే. నేను లేనిది ఏ వస్తువూ లేదు. నేను లేకపోతే ఏ శక్తి అయినా సరే అశక్తే అవుతుంది. అంతదాకా ఎందుకు ? నేను లేకుండా మీ ముగ్గురూ కూడా ఏ పనీ చెయ్యలేరు. బ్రహ్మ సృష్టి చెయ్యలేడు. విష్ణువు పోషణ, రుద్రుడు లయము చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మలోకాలను సృష్టి చేయగలుగుతాడు. విష్ణువు లోకాలను రక్షించగలుగుతాడు. రుద్రుడు లయం చెయ్యగలుగుతాడు. అనంతుడు, ఆదివరాహము, ఆదికూర్మములు కూడా శక్తి ఉంటేనే ఈ భూమిని మోయగలుగుతున్నాయి. అంతదాకా ఎందుకు ? నీరు, నిప్పు, గాలి, వీటికి కూడా శక్తి లేకపోతే కేవలము పేర్లే మిగులుతాయి." అని చెబుతుంది. **ఆవిడే పరమేశ్వరి,** ఆవిడే పరమాత్మ, పరబ్రహ్మ స్వరూపము, పరంజ్యోతి, పరాత్పరి అని చెప్పబడుతున్నది. పరమేశ్వరి అంటే – పరానికి ఈశ్వరి. పరాన్ని ఇచ్చేది. పరము అంటే మోక్షము. కాబట్టి మోక్షాన్ని ఇచ్చే శక్తి గలది. పరాత్పరురాలైన ఈశ్వరి. జగత్తులో జీవులకు వారి వారి కర్మలననుసరించి దేహము, ఇంద్రియాలు వంటివి ఏర్పడతాయి. కర్మ ఎప్పుడైతే నశిస్తుందో దేహము కూడా అప్పుడే నశిస్తుంది. మరణానంతరము జీవి తానుచేసిన కర్మ ఫలాన్ననుభవించి, కర్మ శేషాన్ననుభవించటం కోసం ఈ లోకంలో మళ్ళీ పుడుతుంది. ఈ రకంగా జీవి ఈ లోకంలో జన్మిస్తూ, కర్మచేస్తూ, కర్మఫలితాన్ని అనుభవించి మరణిస్తూ మళ్ళీ పుడుతూ ఉంటుంది. కర్మ పూర్తిగా క్షయమయ్యేదాకా ఈ రకంగానే జరుగుతుంటుంది. కర్మక్షయం అయితే పునర్జన్మ ఉండదు. అదే సాయుజ్యము. ఈ రకమైన కర్మ సంబంధం లేనటువంటిది పరమేశ్వరి. లలితాసహస్రంలో 396వ నామము **'పరమేశ్వరి'**. పరం అంటే బ్రహ్మ అని అర్థం. అతడే శివుడు. పరబ్రహ్మ నాలుగు రూపాలు కలిగి ఉంటుంది. అవి

1) పురుషుడు 2) వ్యక్తము 3) అవ్యక్తము 4) కాలము. అని విష్ణుపురాణంలో చెప్పబడింది. వీటికన్న గొప్పది పరమేశ్వరి.

కార్యకారణములకన్న వేరైనది అయిన నిత్య శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపము 'పరమ' అనబడుతుంది. నశించేటటువంటి దేహాదులచే నశించనిది. శ్రేష్ఠమైనది. వేదమునందు చెప్పబడినది. ఈ జగత్తును అందంగా ప్రకాశింపచేసే తత్త్వము.

అదే 'పరమా' అనబడుతుంది. లలితా సహస్రంలో 618వ నామము **'పరమా'.** ఆవిడే పరంజ్యోతి. పరము అనగా ఉత్కృష్టమైనది. అన్నింటికన్నా గొప్పదైనది. బృహదారణ్యకములో చెప్పినట్లుగా జ్యోతిషులకు కూడా జ్యోతిషుగా ఉన్నది. కఠోపనిషత్తులో చూడండి 'ఆత్మ చాలా ప్రకాశవంతమైనది. అక్కడ సూర్యుడు కాని, చంద్రుడు కాని, నక్షత్రాలు కాని ప్రకాశించవు' అంటాడు. భైరవయామళంలో పరమేశ్వరి కొన్ని వేలకోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది. ఆ కాంతి నుండి అగ్ని 108 కిరణాలు, సూర్యుడు 116 కిరణాలు, చంద్రుడు 136 కిరణాలను మాత్రమే తీసుకోగలిగారు. వీటివల్లనే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఈ రకంగా కాంతినిచ్చే సూర్య, చంద్రాగ్నులకు కూడా కాంతినీ, ప్రకాశాన్ని ఇచ్చేది ఆ పరమేశ్వరి. అంటే ఆమె పరంజ్యోతి. లలితా సహస్రంలో 806వ నామము **'పరంజ్యోతిః'** ఆమెయే పరాత్పరి. పరులైన వారికన్నా కూడా పరమైనది. శ్రేష్ఠమైన వారికన్నా కూడా శ్రేష్ఠమైనది. కాలమానంలో అతిపెద్దది బ్రహ్మకల్పము. ఇది బ్రహ్మయొక్క ఆయుష్షు. ఇతడు చతుర్ముఖబ్రహ్మ. అతన్నే కర్మబ్రహ్మ అని కూడా అంటారు. త్రిమూర్తులలో మొదటివాడు. ఇతడే సృష్టికర్త. ఇతని ఆయువుకన్న ఎక్కువైనది, శాశ్వతమైనది.

పరమేశ్వరికి కాలమానం లేదు. ఆమె ఆదిమధ్యాంత రహితమైనది. జన్మ, మృత్యు, జరాదులు లేనిది. సత్యము, నిత్యము, శాశ్వతము అయినది. వేదంలో చెప్పినట్లుగా

ఇంద్రియాలకన్న – మనస్సు శ్రేష్ఠమైనది
మనస్సుకన్న – బుద్ధి శ్రేష్ఠమైనది
బుద్ధికన్న – మహత్తు శ్రేష్ఠమైనది
మహత్తుకన్న – అవ్యక్తము శ్రేష్ఠమైనది
అవ్యక్తముకన్న – పరబ్రహ్మ శ్రేష్ఠమైనది

పరబ్రహ్మ కన్న శ్రేష్ఠమైనది ఏదీ లేదు. అందుచేతనే ఆమె 'పరాత్పరి' అనబడుతోంది. లలితాసహస్రంలో 809వ నామము **'పరాత్పరా'.**

జీవుల యొక్క కర్మని క్షయం చేసి వారికి మోక్షం ప్రసాదించాలనే ఉద్దేశ్యంతోనే ఈ జగత్తును సృష్టిస్తున్నది. ప్రళయం జరిగినప్పుడు ఈ జగత్తు అంతా నాశనం



అయిపోతుంది. ఆ సమయంలో కర్మ క్షయం అయిన జీవరాశికి మోక్షం లభిస్తుంది. కాని కర్మక్షయం కాని జీవరాశి తమ కర్మను తమతోపాటుగా మూట కట్టుకుని ఆ పరమేశ్వరిలో లీనమయిపోతుంది. మళ్ళీ కొంతకాలానికి, అంటే జీవుల కర్మ పరిపక్వమై, అనుభవించే స్థితికి వచ్చిన తరువాత ఈ సృష్టి జరుగుతుంది. ఈ రకంగా సృష్టి, స్థితి, లయాలను చేసేది పరమేశ్వరి. అందుకే లలితా సహస్రంలోని 551వ నామము **'వియదాదిజగత్ప్రసూః'.**

బహ్వృచోపనిషత్తులో సృష్టి ప్రారంభానికి ముందు పరమేశ్వరి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ జగత్తును సృష్టి చేసింది. ఆమెనుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, అందరూ పుట్టారు. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, జారజాలు మొదలైన ప్రాణులు, స్థావరజంగమములు అన్నీ ఆ పరమేశ్వరి నుంచే ఉద్భవించాయి అని చెప్పబడింది.

దేవీ ఉపనిషత్తులో దేవతలంతా పరమేశ్వరిని సమీపించి 'అమ్మా ! నీవెవరవు?' అని అడుగుతారు. అప్పుడు ఆ దేవి "నేను పరబ్రహ్మస్వరూపాన్ని. నావల్లనే ప్రకృతి, పురుషాత్మకమైనజగత్తు ఆవిర్భవించింది. శూన్యము నేనే, అశూన్యము నేనే. ఆనందము నేనే. అనానందము నేనే. విజ్ఞానము, అవిజ్ఞానము నేనే. పంచ భూతములు, అఖిలజగత్తు, వేదాలు, విద్య, అవిద్య అంతా నేనే." అని చెబుతుంది. **ఆవిడే పరమేశ్వరి.**

శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో ఆ పరమేశ్వరిని స్తుతిస్తూ **"ప్రణన్తుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి."** సృష్టి, స్థితి, లయాలకు కారణభూతమైన ఓ పరమేశ్వరీ ! నీకు నమస్కరించాలన్నా, నిన్ను స్మరించాలన్నా, నీ గురించి వినాలన్నా, పూర్వజన్మలో చేసిన సుకృతం ఉండాలి, అంటున్నారు. లలితాసహస్రంలో చెప్పిన **'శివశక్త్యైకరూపిణి'** ఈమెయే.

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు గనక ఒకరూపం పొందినట్లైతే, అదే పరమేశ్వరి. సృష్టి ప్రారంభానికి ముందు నిరాకారుడుగా ఉన్న పరమేశ్వరుడు, సృష్టి చేయాలనే సంకల్పంతో తనను తాను రెండుగా విభజించు కున్నాడు. వారే శివాశివులు. పరమేశ్వరి, పరమేశ్వరులు. శివశక్తులు. వారి సమాగమ ప్రదేశమే శ్రీచక్రము. ఒక్కసారి మంత్రశాస్త్రంలోకి గనక చూసినట్లైతే, శివ అంటే

నాలుగు, శక్తి అంటే ఐదు. వెరసి తొమ్మిది చక్రాలతో అలరారేదే శ్రీచక్రము. దీనిని 'నవయోన్యాత్మకము' అంటారు. ఇందులో శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు. వెరసి తొమ్మిది చక్రాలుంటాయి. ఇదే చరాచరజగత్తుకు, విశ్వమానవాళికీ ప్రతీక.

శక్తి లేకపోయినట్లైతే సాక్షాత్తు ఈశ్వరుడికి కూడా సృష్టి స్థితి లయాలు చెయ్యటం సాధ్యం కాదు వామకేశ్వర తంత్రంలో

**పరోఽపి శక్తిరహితః శక్త్యాయుక్తో భవేద్యపి ।**

**సృష్టి స్థితిలయాన్ కర్తు మశక్తః శక్త ఏవహి ॥**

పరుడు కూడా శక్తిరహితుడైనట్లైతే సృష్టి, స్థితి, లయాలు చెయ్యలేడు. శక్తితో కలిస్తేనే వాటిని చెయ్యగలుగుతాడు. మానసోల్లాసము అనే గ్రంథంలో

**యేఽపి బ్రహ్మాదయోదేవా భవంతి వరదాయినః**

**త్వద్రూపం శక్తిమాసాద్యతే భవంతి వరప్రదః**

**తస్మాత్ త్వయేవ సర్వత్ర కర్మణాం ఫలదాయినీ ॥**

శివుడు, శక్తి ఈ ఇద్దరూ వేరు వేరు కాదు. ఇద్దరూ ఒక్కటే. శివుడు లేకుండా శక్తి గాని, శక్తి లేకుండా శివుడుగాని ఉండరు.

**తంతుమాన్ పటః** నూలుపోగులు కలది వస్త్రము. **మృద్వాన్ ఘటః** మట్టితో తయారైనది కుండ. అలాగే శక్తి గలవాడే శివుడు. శివుడే శక్తి. శక్తే శివుడు. ఇద్దరూ ఒక్కటే. ఉపాసకులు కేవలము తమ వాసనాభేదములచేత భేదాలు సృష్టిస్తున్నారు. 'పరిమళ' అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**అలేఖ్యవిశేష ఇవ గజవృషభయోర్ద్వయోః ప్రతిభాసమ్ ।**

**ఏకాస్మిన్నేవార్థే శివశక్తి విభాగ కల్పనాం కుర్మః ॥**

ఒక బొమ్మను చూసి కొందరు శివుడు అన్నారు. మరి కొందరు శక్తి అన్నారు. ఉన్నది మాత్రం ఒకే బొమ్మ. మీ మీ భావనలను బట్టి దాన్ని పిలుస్తున్నారు అంతే. అదే పరమేశ్వర తత్త్వము. 'మాతృకా హృదయము' అనే గ్రంథంలో మనం మాట్లాడే భాషలో కూడా



**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ।**

**అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః ॥**

అ నుంచి అః వరకు ఉండే అచ్చులు శక్తిరూపాలు. క నుంచి క్ష వరకు హల్లులు శివరూపాలు. ఈ రెండూ కలిస్తేనే కాని అక్షరం పూర్తి కాదు. రుద్రయామళంలో చెబుతారు చూడండి.

**శక్తిః ప్రాణశ్చ జీవశ్చ మంత్రోనాదః శివోరవిః**

మంత్రశాస్త్రంలో కూడా శక్తియే ప్రాణము, జీవము అవుతున్నది. ఉదాహరణకు బాలామంత్రం చూడండి. ఇందులో మొత్తం మూడుబీజాలున్నాయి. అవి

**వాగ్భవం ప్రథమ బీజం । కామరాజం ద్వితీయకం**

**తృతీయం శక్తికూటాఖ్యం । నిగమత్రితయోద్ధృతమ్**

**ఇత్థం కుమారీ విద్యయా బీజత్రయముదీరితమ్ ॥**

| | | |
|---|---|---|
| మొదటిది వాగ్భవబీజము | – | ఐం |
| రెండవది కామరాజబీజము | – | క్లీం |
| మూడవది శక్తిబీజము | – | సౌః |

ఇందులో శక్తిబీజమున్నది కాబట్టే ఆ మంత్రానికి సంపూర్ణత్వము సిద్ధిస్తున్నది. 'స్కాంద పురాణం'లో

**ప్రణవో బీజమాఖ్యాతం నమఃశక్తి రుదీరితా ।**

**ఋషిః స్వాధ్యాయేదేవోఽస్య పంక్తిశ్ఛంద ఉదాహృతమ్**

**పార్వతీవల్లభః సాక్షాదేవతాత్ర సదాశివః ॥**

శివపంచాక్షరి 'ఓం నమశ్శివాయ.' ఇందులో నమః అనేది శక్తి. ఈ శక్తి లేకుండా మంత్రం పూర్తి కాదు. ఫలించదు.

ఈ రకంగా శంకర భగవత్పాదుల వారు శివశక్తుల స్వరూపమైన పరమేశ్వర తత్త్వాన్ని కీర్తించారు. గౌడపాదుల వారు తమ 'సుభగోదయస్తుతి'లోని మొదటి శ్లోకంలో

**భవాని త్వం వందే భవమహిషి సచ్చిత్సుఖ వపుః**
**పరాకారాం దేవీ మమృతలహరీ మైందవ కళామ్ ।**
**మహాకాలాతీతాం కలితసరణీ కల్పితతనుం**
**సుధాసింధోరంతర్వసతిమనిశం వాసరమయీమ్ ॥**

భవానీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సచ్చిదానంద స్వరూపిణివి. పరాకారమైన దేవివి. అమృతలహరివి. అఖండమైన కాలానికి అతీతురాలవు. నిరాకారవు. అయినప్పటికీ మాయాశక్తి వలన కల్పించబడిన ఆకారముతో ప్రకాశిస్తున్నావు. అటువంటి బిందు స్వరూపిణివైన నీకు నమస్కరిస్తున్నాను అని అంటారు. 'దేవీ మహిమ్నాస్తుతి' అనే గ్రంథంలో దుర్వాసులవారు

**శ్రీమాత స్త్రిపురే ! పరాత్పరతరే ! దేవీ ! త్రిలోకీ ! మహా**
**సౌందర్యార్ణవ మందనోద్భవసుధా ప్రాచుర్యవర్ణోజ్వలం**
**ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభం తే వపుః**
**స్వాన్తేమే స్ఫురతు త్రిలోక నిలయం జ్యోతిర్మయం వాఙ్మయం ॥**

'ఓ తల్లీ ! త్రిపురా ! పరాత్పరీ ! ముల్లోకములందు సౌందర్యమైనదానా; అమృతము వంటిదానా, బాలభానుని అరుణారుణచ్ఛాయతో ప్రకాశించే ఓ దేవీ ! త్రిలోకమయము, జ్యోతిర్మయము, వాఙ్మయము అయిన రూపము గలదానా ! నా ఉపాసనలో నిరంతరము నీ రూపము దర్శనమిచ్చును గాక.' అని ప్రార్థిస్తున్నారు.

అలాగే సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో శంకర భగవత్పాదులవారు

**శివ శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవో నఖలు కుశలః స్పన్దితు మపి ।**
**అతస్త్వా మారాధ్యాం హరిహర విరఞ్చాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి ॥**

అమ్మా ! ఓ పరమేశ్వరీ ! సర్వమంగళకారకుడైన శివుడు కూడా జగన్నిర్మాణ శక్తివైన నీతో కూడితేనే కాని ఈ జగత్తులను నిర్మించలేడు. నీతో కలువకపోయినట్లైతే అతడు కదలటానికి కూడా శక్తి లేనివాడవుతాడు. కాబట్టి త్రిమూర్తులచేత కూడా



పూజింపబడే నీకు నమస్కరించాలన్నా, నిన్ను పూజించాలన్నా, నిన్ను స్తుతించాలన్నా, కనీసం నీ పేరు తలచాలన్నప్పటికీ కూడా, గత జన్మలలో పుణ్యం చెయ్యనివాడు సమర్థుడు కాదు. అంటే పూర్వజన్మ సుకృతం లేనిదే నిన్ను అర్చించటం కాదు కదా, కనీసం నీ పేరు తలచటానికి కూడా అర్హత ఉండదు. అంటారు. **ఆవిడ– పరమేశ్వరి.** పరానికి ఈశ్వరి కాబట్టి పరమేశ్వరి–అనబడుతుంది. ఆవిడే బ్రహ్మ రూపంలో ఈ జగత్తును సృష్టిస్తోంది. విష్ణువు రూపంలో జగత్తును రక్షిస్తున్నది. రుద్రుని రూపంలో జగత్తును సంహారం చేస్తున్నది. ఈశ్వరుని రూపంలో తిరోదానము అంటే సంపూర్ణ నాశనము చేస్తుంది. దీన్నే 'లయము' అంటారు. సదాశివుని రూపంలో, ఏమీ మిగలకుండా పూర్తిగా పరమాణువులతో సహా నాశనమయి పోయిన జగత్తును మళ్ళీ సృష్టించటానికి సుముఖంగా ఉంటుంది. ఈ ఐదు రకాల పనులు చేస్తుంది. కాబట్టే ఆవిడ 'పంచకృత్య పరాయణ' అనబడుతుంది. అర్హులైన వారికి ముక్తిని ప్రసాదిస్తుంది. **ఆవిడ – పరమేశ్వరి.** ఆ దేవి యొక్క మంత్ర, యంత్ర, తంత్ర విషయాలనే 'శ్రీవిద్య' అంటారు.

ఆవిడ అర్థమయి, శబ్దమయి, చక్రమయి, దేహమయి.

**అర్థమయి :** శివాది క్షితిపర్యంతము ఉన్నటువంటి తత్త్వాలతో నిండినది. అసలు తత్త్వము అంటే ఏమిటి? తత్త్వము అంటే యదార్థము, సత్యము, బ్రహ్మము, స్వభావము, సృష్టికి ప్రప్రథమావయవభూతమైన ప్రకృతి మొదలైన పదార్థము అని అర్థము. ఈ తత్త్వాలు ఎన్ని అనే విషయంలో ఒక్కొక్క మతస్థులు ఒక్కొక్క రకంగా చెప్పారు.

| మతస్థులు | తత్త్వముల సంఖ్య | తత్త్వములు |
|---|---|---|
| 1. బౌద్ధులు | 1 | శూన్యము |
| 2. చార్వాకులు | 4 | భూమి, నీరు నిప్పు, గాలి |
| 3. అర్హతులు | 2 | జీవము, అజీవము. |
| 4. అర్హతులలో కొందరు | 5 | జీవము, ఆకాశము, ధర్మము, అధర్మము, పుద్గలము. |

| | | |
|---|---|---|
| 5. అర్హతులలో మరికొందరు | 7 | జీవము, అజీవము, అస్రవము, బంధము, సంవరము, నిర్జరము, మోక్షము. |
| 6. ద్వైతులు | 2 | స్వతంత్రము, అస్వతంత్రము. |
| 7. విశిష్టాద్వైతులు | 3 | చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు. |
| 8. శైవులు | 3 | పశువు, పతి, పాశము. |
| 9. సాంఖ్యులు | 25 | పంచభూతాలు, పంచతన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, అవ్యక్తము, బుద్ధి, అహంకారము, ఆత్మ. |
| 10. యోగులు | 26 | సాంఖ్యులు చెప్పిన 25, ఈశ్వరుడు. |
| 11. అద్వైతులు | 1 | బ్రహ్మము. |

అద్వైత సిద్ధాంతంలో ఈ జగత్తుకు కారణము పరబ్రహ్మమే. అయితే అది అనేక రకాలుగా పరిణామం చెందుతున్నది. కాబట్టి వీటన్నింటినీ తత్త్వములు అనే అంటారు. ఈ తత్త్వాలు 51 అని కొందరు, 36 అని మరికొందరు చెప్పటం జరిగింది. వీరు చెప్పిన 51గాని, 36 గాని లెక్కలోకి తీసుకున్నట్లైతే, వాటిలో కొన్నింటిలో మరికొన్ని కలిసిపోతున్నాయి. ఉదాహరణకు త్వగాది ధాతులు 7. ఇవి పంచభూతాలలో కలిసిపోతున్నాయి. అలాగే పంచప్రాణాలు వాయువునందు కలిసిపోతాయి. ఈ రకంగా కలిసిపోయిన వాటిని వదలి వెయ్యగా మిగిలినవి 25 ధాతువులే అవుతాయి. అందుకే 'సుభగోదయస్తుతి'లోని 5వ శ్లోకంలో గౌడపాదాచార్యుల వారు .....

**పృథివ్యాపస్తేజః పవనగగనే తత్ప్రకృతయః**
**స్థితా తన్మాత్రాస్థా విషయ దశకం మానసమితి ।**
**తతో మాయావిద్యా తదనుచ మహేశః శివ ఇతి**
**పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥**



పంచభూతాలు – 5, తన్మాత్రలు – 5, జ్ఞానేంద్రియాలు – 5, కర్మేంద్రియాలు – 5, మనస్సు, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు. వెరసి తత్త్వాలు 25 అన్నారు. ఇక్కడ శివాది క్షితి పర్యంతము అన్నారు కదా అని అనుమానం వస్తుంది. ఈ శ్లోకం మొదటి పదం చూడండి. పృథివి అంటే క్షితి, భూమి, అలాగే మూడవపాదం చివర చూడండి 'శివ' ఇది ఆఖరుది. క్రింది నుంచి పైకి చెబితే క్షితి మొదలు శివ వరకు అలాగే పై నుంచి క్రిందికి చెబితే శివాది క్షితి పర్యంతము అవుతుంది. ఈ రకంగా 25 తత్త్వాలతో కూడి ఉన్న సృష్టి 'అర్థమయి' అనబడుతుంది.

**శబ్దమయి :** శబ్దము అంటే ధ్వని, వాక్కు అని అర్థం. ఈ వాక్కు నాలుగు రకాలుగా ఉంటుంది. అవే 1. పరా 2. పశ్యంతి 3. మధ్యమ 4. వైఖరి.

పరాస్థానం వాక్కుకు ప్రథమ స్థానం. అక్కడ ఆలోచన పుడుతుంది. తరువాత రెండవది పశ్యంతీ స్థానం. వాక్కు యొక్క రూపాలలో కౌళ, సమయాచారులకు తేడా లేదు. వాక్కు యొక్క స్థానాలలోనే తేడా ఉంది. సమయాచారుల ప్రకారం పరావాక్కుకు స్థానం సహస్రారం. పశ్యంతి స్థానం ఆధారచక్రం. కాగా కౌళాచారులకు పరావాక్కుకు స్థానం ఆధారచక్రం. పశ్యంతీ వాక్కుకు స్థానం మణిపూరం. అక్కడ నుంచి ముందుకు వెడితే మధ్యమ వైఖరి స్థానాలలోగాని, ఆ రూపాలలోగాని వారికి తేడాలేదు.

ఏదైనా విషయం చెప్పాలంటే ముందుగా ఆలోచన రావాలి. అదే పరావాక్కు. ఆ తరువాత వాక్కు ఆధారచక్రం నుండి బయలుదేరి, నెమ్మదిగా స్వాధిష్ఠాన, మణిపూరాలు దాటి, అనాహతం చేరి అక్కడ నుండి కంఠస్థానమైన విశుద్ధి చేరి, ముఖం ద్వారా, వైఖరీ వాక్కుగా బయటకు వచ్చి, శబ్దతరంగాలుగా చెవిరంధ్రాన్ని చేరుతుంది.

1. **పరావాక్కు:** ప్రత్యక్చితీ రూపం గలది. ఆత్మజ్ఞానం పొందటాన్ని 'ప్రత్యక్చితి' అంటారు. దీనికి రూపంలేదు.
2. **పశ్యంతీ వాక్కు :** పరదేవత అనబడుతుంది. ఇది పూర్తిగా అస్పష్టమైనది. పసిపిల్లవాడి ఏడుపులా ఉంటుంది.

**3. మధ్యమావాక్కు:** పూర్తిగా అస్పష్టంకాదు. అలా అని స్పష్టంగానూ ఉండదు. మాటలు వచ్చీ రాని పిల్లలు మాట్లాడినట్లుంటుంది. ఇది పూర్తిగా హల్లులతో కూడి ఉంది.

**4. వైఖరీవాక్కు:** ఇది స్పష్టమైన వాక్కు.

గాలి బుడగలాగా ఆధార చక్రంలో ప్రారంభమైన వాక్కు రూపాంతరం చెంది, విశుద్ధి చక్రంలో ఉన్న అచ్చులతో కలసి, స్పష్టమైన వైఖరీ వాక్కుగా అవుతుంది.

ఈ విషయమంతా 'లలితా సహస్రం'లోని 366 నుండి 374వ నామం దాకా వివరించబడింది. దీనిమీద ఇంకా వివరణ కావాలంటే నాచే వ్రాయబడిన **శ్రీవిద్యాసారథి** (లలితా రహస్యనామ భాష్యము) చూడండి. ఈ రకంగా చతుర్విధ శబ్దాలతో కూడిన సృష్టి **'శబ్దమయి'** అనబడుతుంది.

**చక్రమయి :** ఇక్కడ చక్రము అంటే శ్రీచక్రము. ఇందులో తొమ్మిది ఆవరణలు ఉన్నాయి. వీటినే చక్రాలు అంటారు.

1. భూపురము – త్రైలోక్య మోహన చక్రము
2. షోడశదళము – సర్వాశా పరిపూరక చక్రము
3. అష్టదళము – సర్వసంక్షోభణ చక్రము
4. చతుర్దశారము – సర్వసౌభాగ్యదాయక చక్రము
5. బహిర్దశారము – సర్వార్థసాధక చక్రము
6. అంతర్దశారము – సర్వరక్షాకర చక్రము
7. అష్టకోణము – సర్వరోగహర చక్రము
8. త్రికోణము – సర్వసిద్ధిప్రద చక్రము
9. బిందువు – సర్వానందమయ చక్రము

ఈ రకంగా బిందువు నుండి భూపురమువరకు గల సృష్టి 'చక్రమయి' అనబడుతుంది. శ్రీచక్రము మీద ఇంకా వివరాలు కావాలంటే నేను వ్రాసిన **'శ్రీవిద్యా మహాయంత్రము'** లేదా **'శ్రీచక్రము'** పుస్తకాలు చూడండి.



**దేహమయి :** దేహము అంటే మానవ శరీరము. ఇది పాంచభౌతికమైనది. ఈ శరీరము మూడురకాలుగా చెప్పబడుతుంది. 1. స్థూలశరీరము 2. సూక్ష్మ శరీరము 3. కారణ శరీరము

**1. స్థూలశరీరము :** చర్మము, మాంసము, రక్తము, నరాలు, మేద, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడిన ఈ స్థూలదేహం అసహ్యకరమైనవి. పూర్వకర్మలననుసరించి, పంచభూతాల కలయికచేత ఈ దేహము ఏర్పడింది. భోగాలు అనుభవించటానికి ఆధారము ఈ దేహమే. జీవుడు ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. స్థూలశరీరము ఎల్లప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలేవీ దానికి తెలియవు. కాబట్టి జాగ్రదావస్థలో ఈ శరీరానికి ప్రాధాన్యత ఉంది. ఈ శరీరం గృహస్థుకు గృహంలాగా జీవాత్మకు ఆవాసమై ఉన్నది. మానవుడు తాను చేసిన పాపపుణ్యాలన్నీ ఈ దేహం ద్వారానే ఈ లోకంలో అనుభవిస్తాడు. జనన మరణాలు, బాల్య కౌమార యవ్వన, వార్ధక్యదశలు, వర్ణాశ్రమ ధర్మాలు, మానావమానాలు అన్నీ ఈ దేహానికే చెందుతాయి.

**2. సూక్ష్మశరీరము :** వాక్కు మొదలైన కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు, పంచప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, విద్య, కామము, కర్మ అనేవన్నీ కలిసి సూక్ష్మశరీరము అనబడుతుంది. సూక్ష్మశరీరాన్నే లింగశరీరము అంటారు. ఇది పంచీకృత భూతాలవల్ల ఏర్పడి, వాసనలతో కూడినదై, కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈ సూక్ష్మశరీరమే అనుభవిస్తుంది. స్వప్న జగత్తులో స్వయంప్రకాశమైన పరమాత్మ భిన్నరూపాలతో ప్రకాశిస్తుంది. బుద్ధి స్వప్నంలో జాగ్రదావస్థలోని అనేక రకాలయిన వాసనలతో, కర్మ మొదలైన భావాలు పొంది తానే స్వయంగా ప్రకాశిస్తుంది.

బుద్ధియే ఉపాధిగా కలిగినట్టి ఆ సర్వసాక్షి ఆ బుద్ధి చేసిన కర్మలతో ఏమీ సంబంధం లేకుండా ఆ కర్మలు ఏ మాత్రం అంటకుండా ఉంటాడు. అందుకే అతడికి కర్మలు అంటవు.

వడ్రంగివాడి చేతిలోని బాడిస అన్ని పనులకు అతడికి ఏ రకంగా ఉపయోగిస్తుందో, అదే విధంగా ఈ లింగదేహం చిదాత్మ అయిన పురుషుని యొక్క సమస్త వ్యాపారాలకు అంటే అన్ని పనులకు ఉపయోగిస్తుంది.

**3. కారణశరీరము :** గుణత్రయమే ఆత్మయొక్క కారణశరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్ని రకాలైన జ్ఞానము శాంతిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో మాత్రమే ఉంటుంది. సామాన్యంగా 'నిద్రలో నాకేం తెలియదు' అంటాం. అదే సుషుప్తి. ఆ స్థితిలో శరీరంలోని అన్ని అవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి. అప్పుడు ఉండేదే కారణ శరీరము.

ఈ రకంగా స్థూల సూక్ష్మ కారణ శరీరాలతో కూడిన సృష్టి 'దేహమయి' అనబడుతుంది.

ఆ శక్తి పరిణామము చెంది అర్థమయి, శబ్దమయి, చక్రమయి, దేహమయి అయిన సృష్టిగా ప్రకాశిస్తున్నది. అందుచేత మోక్షం కావాలి అనుకున్నవాడు, ఈ విధంగా పరిణామం చెందిన ఆ శక్తిని గురించి తెలుసుకోవాలి. పరమేశ్వరుడికి, ఈ జగత్తుకు భేదం లేదు. ప్రపంచానికి పరబ్రహ్మకీ కనపడే భేదము కేవలము వ్యావహారికము. అంతేగాని నిజంగా సత్యంకాదు. ఈ విషయం, శక్తి జ్ఞానము ఒక మంచి గురువువల్ల పొంది, ఆ శక్తికి, బ్రహ్మకు, తనకు, గురువుకు భేదం లేదు. అంతా ఒక్కటే ! అనే విషయం తెలుసుకున్నట్లైతే, సాధకుడు అద్వైతానందాన్ని అనుభవిస్తాడు. అంటే తానే పరబ్రహ్మ అయి, బ్రహ్మానందం పొందుతాడు.

సమయులకు షట్చక్రపూజ నియతం కాదు. వారికి సహస్రదళకమలమందే పూజ. అంటే సహస్రకమలము బైందవ స్థానంగాను, దాని మధ్యలో ఉన్న చంద్ర మండలము చతుష్కోణము గాను, దాని మధ్యలో ఉన్న బిందువు 25 తత్త్వములకు అతీతమైన 26వ తత్త్వము, శివశక్తుల మేళన రూపమయిన సాదాఖ్య కళ అని చెప్పటం జరిగింది. అందుకనే సమయమతంలో బాహ్యపూజ లేదు. చతుర్విధైక్య సంధానము లేదా షడ్విధైక్య సంధానమే భగవతికి సపర్య. ఈ సపర్యకు సాదాఖ్య తత్త్వధ్యానైకనిష్ఠ కావాలి. సాదాఖ్య అని పిలువబడేది సహస్రారంలో ఉండే చంద్రకళ.

శ్రీచక్రరూపమైన చంద్రబింబంలో ఒకే కళ ఉన్నది. అది పరమాకళ. ఆజ్ఞా చక్రంలో ఉన్న చంద్రుడికి 15 కళలున్నాయి. 16వది పరమాకళ. చిద్రూప. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుని కన్న భిన్నమైన చంద్రుడు సహస్రారంలో ఉన్నాడు. ఇదే బైందవ స్థానము, సుధాసింధువు, సరఘ అని పిలవబడుతోంది. కాబట్టి సమయ



మతస్థులు సహస్రదళకమలంలోనే దేవిని పూజించాలి. ఇక్కడ ఉన్న బిందువు శివశక్తులు రూపమైన సాదాఖ్య అను 26వ తత్త్వము. అదే పరబ్రహ్మమహిషీ.

ఆజ్ఞాచక్రం చంద్రకళలు ఉండే స్థానం. సహస్రారం చంద్రమండలము ఇక్కడ ఉండే చంద్రుడు నిత్యకళాయుక్తుడు. అదే శ్రీచక్రము. నాలుగు ద్వారాలు, మూడు భూపురాలుగల శ్రీచక్రము రుద్రగ్రంధిపైన ఉన్నది. శ్రీచక్రము యొక్క నాలుగు ద్వారాలలోనూ మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే నాలుగు తత్త్వాలుంటాయి. వీటినే భగవతి విశ్రమించే మంచానికి నాలుగు కోళ్ళు అంటారు. నాలుగు ద్వారాలు కలిగి కర్ణికారూపంలో ఉన్న శ్రీచక్రంలోని చతుష్కోణము మధ్య గల బిందువునే సరఘ అంటారు. అదే శివశక్తుల సంగమస్థానము.

సాధకుడు కుండలినీ శక్తిని సహస్రారం చేర్చగలిగినట్లైతే, నాలుగు ద్వారాలతో కూడిన శ్రీచక్రంలోనికి ప్రవేశించినట్లే అప్పుడు దేవి సాక్షాత్కారం అవుతుంది.

**శ్రీచక్రస్యచత్వారిద్వారాణి చతుర్వేదరూపిణి**
**ద్వారప్రవేశనైవభవతి పరదేవతా సాక్షాత్కారః**

శ్రీచక్రంయొక్క నాలుగు ద్వారాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. ఆ ద్వారాలలో గనక ప్రవేశించినట్లైతే దేవి సాక్షాత్కారం కలుగుతుంది.

శ్రీవిద్యను గురించి తెలిపే గ్రంథాలలో ముఖ్యమైనవి.

| | |
|---|---|
| 1. లలితా సహస్రము | శ్రీవిద్యాసారథి |
| 2. సౌందర్యలహరి | శ్రీవిద్యాలహరి |
| 3. సుభగోదయస్తుతి | శ్రీవిద్యాదర్పణము |
| 4. యోగినీ హృదయము | శ్రీవిద్యా హృదయము |
| 5. కామకలావిలాసము | శ్రీవిద్యాసర్వస్వము |
| 6. వామకేశ్వరతంత్రము | --- |

వీటిలో మొదటి ఐదు గ్రంథాలను వాటి ఎదురుగా ఇచ్చిన పేర్లతో తెలుగులో వ్రాయటం జరిగింది. ఇవాల్టి రోజున శ్రీవిద్య అంటే ఏమిటో తెలియనివారు కూడా "మేమంతా శ్రీవిద్యోపాసకులము" అని చెప్పుకుంటున్నారు. కాని శ్రీవిద్యను గురించి

చాలామందికి తెలియదు. కాబట్టి అతిసామాన్యుడికి కూడా శ్రీవిద్య అంటే ఏమిటో తెలియాలనే ఉద్దేశ్యంతో ముందుగా

**ఆదినాథ సమారంభాం । శంకరాచార్య మధ్యమాం**

**అస్మదాచార్య పర్యంతాం । వందే గురుపరంపరాం ॥**

నా గురుదేవులైన విరజానందనాథ, సదానందనాథ శుకనందనాథులకు నమస్కరించి, ఏమీ తెలియని నన్ను ఆస్థాన విద్వాంసునిగా నియమించిన అవధూత, దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామివారికి సాష్టాంగదండ ప్రణామాలర్పించి, ధర్మసంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరి, పూరి, బదరి, ద్వారక, కంచి పీఠాధిపతులకు, దేశంలో ఉన్న వివిధ మఠాధిపతులకు, పీఠాధిపతులకు, బాబాలకు, స్వామిజీలకు, మాతాజీలకు విశేషించి శ్రీవిద్యాపరులకు వినయ పూర్వకంగా నమస్కరించి **'పరమానందనాథ'** దీక్షానామం గలిగిన హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారథి అను నేను 'శ్రీవిద్య' అనే పేరు గలిగిన శ్రీవిద్యాపరమైన ఈ గ్రంథాన్ని వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. పరమేశ్వరి భక్తులు, శ్రీవిద్యోపాసకులు అందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదిస్తారని భావిస్తున్నాను.

ప్రస్తుతం 1-3-2009 నుంచి **'సహస్ర చండీయాగం'** చేస్తున్నాను. రోజుకు నాలుగు ఆవృత్తులు చొప్పున 30-11-2009 నాటికి సహస్రము పూర్తి అవుతుందని అంచనా. 20-12-2009న ఈ యాగానికి పూర్ణాహుతి కూడా జరుగుతుంది. ఈ సమయంలో 'శ్రీవిద్య' అనబడే ఈ గ్రంథాన్ని ప్రారంభించటం కేవలము ఆ పరమేశ్వరి సంకల్పమే అని భావిస్తూ గ్రంథాన్ని ప్రారంభిస్తున్నాను. ఈ గ్రంథాన్ని కూడా ఆడియో సిడి రూపంలో మీకు అందించటానికి ప్రయత్నిస్తాను.



## 2. శ్రీవిద్య - వేదవిద్య

**కామోయోనిః కమలేత్యేవం సంకేతితైః శబ్దైః ।**

**వ్యవహరతి న ప్రకాశం యాం విద్యాం వేదపురుషోఽపి ॥**

భాస్కరరాయల వారు శ్రీవిద్యవేదవిద్య అని ప్రతిపాదిస్తున్నారు ఈ శ్లోకంలో. అసలు వేదవిద్య అంటే ఏమిటి ? వేదములయందు చెప్పబడిన విద్య, మోక్షవిద్య అని అర్థం. అసలు వేదాలలో విద్యలు, మంత్రాలు చెప్పబడ్డాయా అని అనుమానం.

వేదం నాలుగు భాగాలుగా ఉన్నది. 1. సంహితలు 2. బ్రాహ్మణాలు 3. ఆరణ్యకాలు 4. ఉపనిషత్తులు. వీటిని గురించి గతంలో చెప్పుకున్నాం. మంత్రభాగ మంతా ఉపనిషత్తులలో చెప్పబడింది. ఉదాహరణకి నారాయణోపనిషత్తును చూడండి.

**ఓమిత్యేకాక్షరం, నమ ఇతి ద్వ్యేక్షరే నారాయణేతి**

**పంచాక్షరాణి । ఏతద్వై నారాయణస్యాష్టారం పదమ్ ॥**

**'ఓం నమో నారాయణాయ'** అనేది అష్టాక్షరీ మంత్రము అని చెబుతోంది. 'గోపాలతాపినీ ఉపనిషత్తు'లో **"క్లీం కృష్ణాయ, గోవిందాయ, గోపీజనవల్లభాయ స్వాహా"** అంటూ గోపాలమంత్రం చెప్పటం జరిగింది. ఈ రకంగా మహామంత్రాలన్నీ వేదాలలో చెప్పబడ్డాయి. అందుకే అవి వైదికమంత్రాలయినాయి. మరి పంచదశీ మహామంత్రం వైదికమంత్రమేనా ? అయితే ఎక్కడ చెప్పబడింది ? అనే అనుమానం జనంలో ప్రబలంగా ఉన్నది. ఆ అనుమానం నివృత్తి చెయ్యటానికే ఈ శ్లోకం చెబుతున్నారు.

శ్రీవిద్య అనేది వేదంలో గుప్తంగా చెప్పబడిన విద్య. ఇది రహస్యాతి రహస్యమైనది. ఋగ్వేదంలో **'త్రిపురోపనిషత్తు'** అని ఉంది. ఆ త్రిపురోపనిషత్తులోని రెండవ మంత్రం చివరలో

**కామోయోనిః కమలా వజ్రపాణిః గుహాహసా మాతరిశ్వాఽభ్రమింద్రః ।**

**పునర్గుహా సకలా మాయయాచ పురూచ్యేషా విశ్వమాతాది విద్యా ॥**

ఇక్కడ కాముడు, యోని, కమల మొదలైన సాంకేతిక పదాలతో ఈ విద్య చెప్పబడింది. అయితే ఇది పంచదశీ మహామంత్రం ఎలా అవుతుంది ? అంటే

**కామో (క) యోనిః (ఏ) కమలా (ఈ) వజ్రపాణిః (ల) గుహా (హ్రీం) హసా (హస) మాతరిశ్వా (క) భ్ర (హ) మింద్రః (ల) పునర్గుహా (హ్రీం) సకలా (సకల) మాయయా (హ్రీం).** ఇది వేదంలో చెప్పబడిన పంచదశీ మహామంత్రం.

అసలు పంచదశీ మహామంత్రం 15 అక్షరాలు కలిగి ఉంటుంది. ఆ మంత్రం మూడు భాగాలుగా, మూడు కూటములుగా ఉంటుంది. అధర్వణవేదంలోని "త్రిపురతాపినీ ఉపనిషత్తు"లోని మొదటి అధ్యాయంలో గాయత్రీ మంత్రము, పంచదశీ మహామంత్రము ఒక్కటే అని నిరూపించారు. అలాగే 'త్రిపురసుందరీ ఉపనిషత్తు'లో

**దక్షిణామూర్తి ఋషిః । పంక్తిచ్ఛందః । లలితా త్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌః శక్తిః । క్లీం కీలకమ్ । క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । సకల హ్రీం ॥ ఇతి మంత్రః** అని చెప్పబడింది.

ఈ రకంగా పంచదశీమహామంత్రం వేదభాగమైన ఉపనిషత్తులలో చెప్పబడింది. కాబట్టి పంచదశీమహామంత్రము వైదికమంత్రమే. ఈ మంత్రం అత్యంత రహస్యమైనది పై రెండు ఉపనిషత్తులలోను గుప్తంగా చెప్పబడింది. కాని 'త్రిపురసుందరీ ఉపనిషత్తు'లో మాత్రం దీన్ని బహిరంగంగానే చెప్పటం జరిగింది.



# 3. వేదాలు - శ్రీవిద్య

ఇష్టప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ కలిగించటానికి, అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము అన్నాడు సాయణుడు. వేదము మొత్తం నాలుగు భాగాలుగా ఉంటుంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. ఋగ్వేదంలో దేవతల స్తోత్రాలు ఉంటాయి. వాటినే 'సూక్తాలు' అని కూడా అంటారు. పరమేశ్వరిని గురించి కూడా కొన్ని సూక్తాలు ఋగ్వేదంలో ఉన్నాయి. అవే శ్రీసూక్తము, దుర్గాసూక్తము, నీళాసూక్తము, భూసూక్తము మొదలైనవి. ఐతే నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. ఉపనిషత్తులలో పరావిద్య, ఉపాసన, మంత్ర యంత్ర తంత్రాలు వివరించబడ్డాయి.

వేదాలలో అమ్మవారిని గురించి మొత్తం ఎనిమిది ఉపనిషత్తులు ఉన్నాయి. అవి వరుసగా

1. బహ్వృచోపనిషత్తు - ఋగ్వేదము
2. త్రిపురోపనిషత్తు - ఋగ్వేదము
3. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు - ఉపనిషత్తు
4. త్రిపురతాపిని ఉపనిషత్తు - అధర్వణవేదము
5. దేవి ఉపనిషత్తు - అధర్వణ వేదము
6. భావనోపనిషత్తు - అధర్వణ వేదము
7. సీతోపనిషత్తు - అధర్వణ వేదము
8. సరస్వతీ రహస్యోపనిషత్తు - యజుర్వేదము
9. లలితా రహస్యోపనిషత్తు - నా స్వప్న దృశ్యము

మొత్తం మీద అధర్వణ వేదంలో - నాలుగు, ఋగ్వేదంలో - మూడు, యజుర్వేదంలో - ఒక ఉపనిషత్తు ఉన్నాయి. కాగా తొమ్మిదవదయిన లలితా రహస్యోపనిషత్తు నాకు స్వప్నంలో కనిపించింది. ఇప్పుడు ఈ ఉపనిషత్తులలో ఏం చెప్పారో చూద్దాం.

**1. బహ్వృచోపనిషత్తు :** ఇది ఋగ్వేదంలోది. సృష్టికి ముందు కాలంలో ఆ దేవి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ బ్రహ్మాండాన్ని సృష్టించింది. ఆమెయే కామకళ, శృంగారకళ. ఆమె నుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, భోగ్యము, భోగము అన్నీ ఆవిర్భవించినాయి. ఆమెనుంచే సకల జీవకోటి, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, జారజాలు, సకల జీవులు, స్థావరాలు, జంగమాలు, సకల మానవకోటి ఆవిర్భవించింది. ఆవిడే పరాశక్తి. ఆవిడే శాంభవీ విద్య, హాది విద్య, కాదివిద్య, ఆవిడే పురత్రయము, దేహత్రయముల యందు లోపలా బయటా అంతటా వ్యాపించి ఉన్నది. దేశకాల వస్తు సంబంధమువల్ల ఆ మహాత్రిపురసుందరియే 'ప్రత్యక్చితి' అవుతున్నది.

ఆమెయే ఆత్మ. ఆమెకన్న భిన్నమైనదంతా అనాత్మ అసత్యము. కాబట్టే ఆమె బ్రహ్మసంవిత్తి, భావాభావకళా వినిర్ముక్త, చిద్విద్య, సచ్చిదానంద లహరి, మహాత్రిపుర సుందరి అనబడుతుంది. అన్నింటియందు ఉండే అంతర్యామి. అన్నింటియందు వెలుపలా లోపలా కూడా ప్రకాశిస్తుంది. ఆమెయే ప్రియాన్ని, ఆనందాన్ని చేకూర్చేది. ఈ సకలము ఆ మహాత్రిపురసుందరియే. నువ్వు, నేను, ఈజగత్తు, సకల దేవతాగణాలు, అంతా ఆ మహాత్రిపురసుందరియే. లలితాఖ్యమైన వస్తువొక్కటే సత్యము, నిత్యము, శాశ్వతము. అది అద్వితీయము, అఖండము. ఆ బ్రహ్మయొక్క పరతత్త్వమొక్కటే మిగిలి ఉండేది.

ప్రజ్ఞానం బ్రహ్మ అని, అహంబ్రహ్మాస్మి అని, తత్త్వమసి అని, అయమాత్మా బ్రహ్మ అని, సోహమస్మి అని పిలువబడే ఆమెయే మహాషోడశి, శ్రీవిద్య, పంచదశాక్షరి, మహాత్రిపురసుందరి, బాలాంబిక, బగళ, మాతంగి, స్వయంవర కళ్యాణి, భువనేశ్వరి, చాముండ, వారాహి, తిరస్కరిణి, శుకశ్యామల, లఘుశ్యామల, అశ్వారూఢ, ప్రత్యంగిర, ధూమావతి, సావిత్రి, గాయత్రి, సరస్వతి, బ్రహ్మానందకళ అనబడుచున్నది. దేనియందైతే సర్వదేవతలు ఉన్నారో, దానియందే ఋక్కులు కూడా ఉన్నాయి. దీనిని ఎరుగను అనుకునేవాడే దీనిని పూర్తిగా తెలిసినవాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

**2. త్రిపురోపనిషత్తు :** ఇది ఋగ్వేదంలోది. ఈ ఉపనిషత్తులో పంచదశి మహామంత్రం వివరించబడింది.



**3. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు :** ఇది ఋగ్వేదంలోది. ఇందులో శ్రీసూక్తంలో ఉండే పదహారు మంత్రాలకు ఋషి, ఛందస్సు, ఆ మంత్రముల అనుష్ఠానము, దానివల్ల ఫలితము చెప్పబడింది.

**4. త్రిపురతాపినీ ఉపనిషత్తు :** ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. మొత్తం ఐదు అధ్యాయాలుగా ఉంటుంది.

**మొదటి అధ్యాయంలో :** గాయత్రీ మంత్రము, పంచదశీ మహామంత్రము వివరించారు.

**రెండవ అధ్యాయంలో :** త్రిపురా విద్య, త్రిపురేశీవిద్య, త్రిపురమాలినీ విద్య, త్రిపురవాసినీ విద్య, త్రిపురాంబా విద్య మొదలైన ఎనిమిది విద్యలను వివరించారు. ఆ తరువాత శ్రీచక్రాన్ని వివరించారు.

**మూడవ అధ్యాయంలో :** 1. సర్వసంక్షోభిణీ, 2. సర్వవిద్రావిణీ, 3. సర్వాకర్షిణీ 4. సర్వవశంకరి, 5. సర్వోన్మాదిని 6. సర్వమహాంకుశ 7. సర్వఖేచరీ 8. సర్వబీజ 9. సర్వయోని 10. సర్వత్రిఖండ ముద్రలను వివరించారు. వీటినే దశముద్రలు అంటారు.

**నాల్గవ అధ్యాయంలో :** సంసార బంధనాల నుండి విముక్తుడయ్యే మృత్యుంజయ మహామంత్రాన్ని వివరించారు.

**ఐదవ అధ్యాయంలో :** పరమేశ్వరుని పొందటానికి క్రియాకాండ వివరించబడింది.

**5. దేవీ ఉపనిషత్తు :** ఇది అధర్వణవేదంలోది.

ఒకసారి దేవతలంతా పరమేశ్వరి దగ్గరకు వెళ్ళి "ఓ మహాదేవీ ! నీవెవరవు?" అని అడిగారు. అప్పుడు ఆమె "నేను పరబ్రహ్మ స్వరూపిణిని. నా వల్లనే ప్రకృతి పురుషులతో కూడిన ఈ జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము, ఆనందము అనానందము నేనే. విజ్ఞానము నేనే అవిజ్ఞానము నేనే. తెలియదగినది అయిన బ్రహ్మ, అబ్రహ్మ కూడా నేనే. పంచభూతాలు నేనే. అపంచభూతాలు నేనే. అఖిల జగత్తును నేనే. వేదాన్ని నేనే అవేదాన్ని నేనే. విద్యను నేనే. అవిద్యనూ నేనే, అజను నేనే, అనజనూ నేనే. పై భాగము, క్రింది భాగము, మధ్య భాగము నేనే. నేను వసువులతోను, రుద్రులతోను, ఆదిత్యులతోను, విశ్వేదేవతలతోను సంచరిస్తాను.

మిత్రావరణులు ఇద్దరినీ భరిస్తాను. ఇంద్రాగ్నులను, అశ్వనీ దేవతలను భరిస్తాను. సోముడు, త్వష్ట, పూష, భగుడు, విష్ణువు, బ్రహ్మ, రుద్రుడు, వీరందరినీ ధరిస్తాను. యాగం చేసిన యజమాని కోసం ధనాన్ని ధరిస్తాను. నా గురించి తెలుసుకున్నవాడు దేవీపదము పొందుతాడు." అని చెప్పింది. ఆ మాటలు విన్న దేవతలు **(నమోదేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః । నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మతామ్)** దేవీ నీకు నమస్కారము. ఓ మహాదేవీ ! నీకు నమస్కారము, శివా ! నీకు ఎల్లప్పుడూ నమస్కారము, ప్రకృతీ, భద్రా నీకు అనేక నమస్కారాలు. అంటూ పరిపరివిధాల ఆ దేవికి నమస్కరించారు.

దుర్గలలో ప్రశస్తమైన దానిని శరణు కోరుతున్నాను అగ్నితో సమానమైన వర్ణము గలది. తన వేడిచేత శత్రువులను మండింపచేసేది, పరమాత్మ చూడబడినది, కర్మలకు ఫలమైన స్వర్గము, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, పశువులు, పుత్రులు మొదలైన వాటి కోసం ఉపాసకులచే సేవించబడేది, అయిన ఆ దేవిని శరణుగోరుతున్నాను. ఆమె నా తమోగుణాన్ని నశింపచేయుగాక. ఇలా చెప్పి దేవతలు వాగ్దేవిని చూసి, విశ్వరూపులు, ప్రాణులు, స్తుతించినట్లుగా, వారు కోరినట్లుగా ఆ దేవి మాకు అన్నము, బలము ఎక్కువగా ఇచ్చునదై, మా సమీసమున ఉండుగాక. కాళరాత్రి, బ్రహ్మస్తుత, వైష్ణవి, కుమారస్వామి తల్లి, సరస్వతి, అదితి, దాక్షాయణి మొదలైన పేర్లతో పిలువబడే శివుని భార్య అయిన శివకు నమస్కరిస్తున్నాము. మహాలక్ష్మీ, సర్వసిద్ధి అయిన దేవి మాకు ప్రేరకురాలు అగుగాక. కాముడు, యోని, కమల, వజ్రపాణి, కుమారస్వామి, వాయువు, మేఘము, ఇంద్రుడు, గుహుడు వీరంతా ఆ దేవియొక్క మాయచేతనే ఆవిర్భవించారు. ఆమెయే విశ్వమాత, ఆదిశక్తి. ఆమెయే ఆత్మశక్తి, విశ్వమోహిని. పాశము అంకుశము ధనుర్బాణాలు ధరించినది. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు దుఃఖాల నుంచి తరిస్తాడు. ఇక్కడ కామయోనిః అన్న చోట పంచదశీ మహామంత్రం చెప్పబడింది.

ఓ భగవతీ ! నీకు నమస్కారము. తల్లీ మమ్ము రక్షించవలసినది. అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, విశ్వేదేవతలు, ఆమెయే. యాతుధానులు, అసురులు, రాక్షసులు, యక్షులు, పిశాచులు, సిద్ధులు, సత్త్వరజస్తమోగుణాలు ఆమెయే. ఇంద్రుడు, ప్రజాపతి, మనువులు ఆమెయే. నక్షత్రాలు, గ్రహాలు, జ్యోతిస్సులు, కల,



కాష్ఠ మొదలైన కాల విభాగాలు; ఆమెయే. నిత్యము ఆమెకు నేను నమస్కరిస్తాను. తాపహారిణి, భుక్తి ముక్తిప్రదాయిని, అనంత, విజయ అయిన ఆ దేవికి నమస్కారము. ఆకాశబీజమైన 'హ'కారము. అగ్ని బీజమైన 'ర'కారము, లక్ష్మీ బీజమైన 'ఈ'కారము. బిందువులతో కలసిన 'హ్రీం' ఆ దేవియొక్క బీజము. దీనిని యతీశ్వరులు ధ్యానం చేస్తారు. వాఙ్మయి, బ్రహ్మ, భూమి, షష్టవక్రము, సూర్యుడు, వాముడు, శ్రోత్రము, బిందువు, సంయత్యష్టము తృతీయము, నారాయణునితో కూడినది. వాయువు అధరముతో కూడినది, విచ్చేయునది. ఇది నవార్ణవ మంత్రము. **'ఐం హ్రీం క్లీం చాముండాయైవిచ్చే'** ఇదే చండీ మంత్రము. ఇది సర్వశుభాలను, మహదానందాన్ని ఇస్తుంది.

హృదయ పద్మమునందున్నది, బాలభానునితో సమానమైన కాంతి గలది, పాశాంకుశములు ధరించినది, సౌమ్య, వరద, అభయ హస్తములు గలది, త్రినేత్ర, రక్తవస్త్ర భక్తుల కోరికలు తీర్చేది, అయిన దేవిని సేవింతును. ఓ దేవీ ! నీకు నమస్కరిస్తున్నాను. మహాభయనాశిని, మహాదుర్గప్రశమని, మహాకారుణ్యరూపిణి, అయిన నీ రూపాన్ని బ్రహ్మాది దేవతలు కూడా తెలుసుకోలేరు. అందుకే నీవు అజ్ఞేయవు. నీకు అంతము లేదు. అనంతవు. నీయొక్క జ్ఞానము మాకు లభించదు. అందుకే అలక్ష్యవు. నీకు జననము లేదు అందుకే అజవు. తల్లీ ! నువ్వు తప్పించి ఈ జగత్తులో ఏదీ లేదు. అందుకే 'ఏక' అనబడతావు. ఈ జగత్తంతా వివిధ రూపాలతో నిండి ఉన్నావు. అందుకే అనేక అనబడుతున్నావు. మంత్రాలకు మాతృక అయిన ఓ దేవీ ! శబ్దరూపిణీ, చిన్మయాతీతా, నీవే దుర్గవు. దుర్గమమైన కష్టాలనుంచి మమ్ములను రక్షించేదానవు. అటువంటి దుర్గాస్వరూపిణి అయిన నీకు నమస్కరించుచున్నాను. **దుం దుర్గాయై నమః ।** ఓ తల్లీ ! దుర్గా ! మా కష్టాలను హరింపచేయుము.

దుర్గకు, దురాచారాలను నాశనం చేసే దానికి, సంసారార్ణవతారిణికి నమస్కరిస్తున్నాను. అథర్వ శీర్షమైన దేవీ ఉపనిషత్తును పదిసార్లు చదివితే చాలు, కష్టాలన్నీ తొలగిపోతాయి. 108సార్లు చదివితే కార్యసిద్ధి. రాత్రులందు, సంధ్యవేళల యందు చదివితే వాక్సిద్ధి కలుగుతుంది. మంగళవారం, అశ్వనీ నక్షత్రంలో దేవి సన్నిధిన ఈ ఉపనిషత్తు చదివితే మహామృత్యువు దరిచేరదు.

**6. భావనోపనిషత్తు:** ఇది అధర్వణవేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం 49 సూత్రాలు ఉన్నాయి. వాటిలో

1 నుండి 10 సూత్రాల వరకు – మానవదేహమే పరమేశ్వర స్వరూపము అని

11 నుండి 24 సూత్రాల వరకు–మానవ శరీరమే శ్రీచక్రము అని

25 నుండి 49 సూత్రాల వరకు–అంతర్యాగము వివరించబడ్డాయి.

దీని వివరణ అంతా **శ్రీవిద్యాసారథి** (లలితాసహస్రనామభాష్యం)లో ఉన్నది.

**7. సీతోపనిషత్తు :** ఇది అధర్వణ వేదంలోది.

ఒకసారి దేవతలంతా బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి, "దేవదేవా ! ప్రజాపతీ ! సీత అంటే ఎవరు ? ఆవిడ రూపం ఎలా ఉంటుందో వివరించండి." అని అడిగారు ఆ మాటలు విన్న ప్రజాపతి ఆ సీతాదేవి మూలప్రకృతి యొక్క రూపమే అయి యున్నందు వలన ప్రకృతి అని చెప్పబడుచున్నది. సీతా అను పదములో 3 అక్షరములన్నాయి. ఆవిడ సాక్షాత్ మాయాస్వరూపమై యున్నది. విష్ణువు ప్రపంచ బీజము, ఈకారము మాయ, సకారము సత్యము, అమృతము ప్రాప్తము. సోముడని చెప్పబడును. లక్ష్మీబీజము తకారము, శ్రీంకారము, వైరాజము, సోమ, అమృతావయవములు కల దేవి ఈకార రూపిణియగుచున్నది. ఆ దేవి మౌక్తికాదులతో అలంకరింపబడియున్నది. అట్టి రూపము ధరించియున్న మొట్టమొదటి మహామాయ శబ్దబ్రహ్మరూపము. అందువల్ల స్వాధ్యాయ సమయములో ప్రసన్నురాలవుతున్నది. సమున్నత భావనలనుత్పత్తి చేస్తుంది. రెండవ మాయ సాత్మిక పృథ్వీభాగములో హలాగ్రమున జన్మించి యున్నది. ఈకార స్వరూపిణి ఆ దేవియొక్క మూడవ మాయ; అవ్యక్తరూపములో నుండును. శౌనకీయమగు శౌనకీ తంత్రములో సీతాదేవిని గురించి ఈ రీతిగా వర్ణింపబడింది. శ్రీరాముని సన్నిధిలో జగదానందకారిణియైనది, సృష్టి, స్థితి, లయకారిణి గూడ ఆ సీతాదేవియే. వ్యక్తముగా నున్న అన్ని శరీరముల యందు మూలప్రకృతి స్వరూపిణియై సీతాభగవతి జ్ఞేయరూపములో ఉన్నది. ప్రణవమగుట వలన ప్రకృతి అనబడుతుంది. బ్రహ్మవాదిని అనిగూడ అనబడుతుంది. అథాతో బ్రహ్మజిజ్ఞాసా స్వరూపిణి. ఆ దేవి సర్వవేదమయి, సర్వదేవమయి, సర్వకీర్తిమయి,



సర్వమయి, సర్వధర్మమయి, సర్వలోకమయి, సర్వాధార స్వరూప, కార్యకారణమయి మరియు మహాలక్ష్మీ దేవేశుల యొక్క భిన్నా భిన్నరూప చేతనా చేతనాత్మక, బ్రహ్మస్థావరాత్మ, గుణకర్మ విభాగ భేదముతో దేహ స్వరూపిణి, దేవ ఋషి మనుష్య గంధర్వ స్వరూపిణి, అసుర రాక్షస భూతప్రేత పిశాచ భూతాది భూతదేహ స్వరూపిణి, భూతేంద్రియ మనః ప్రాణరూపిణి అని తెలియబడుచున్నది.

ఆ సీతాదేవి మూడు రూపాలతో శక్తి స్వరూపిణిగా ఉన్నది. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, సాక్షాత్ శక్తి అను నామములతో నున్నది. శ్రీ, భూ, నీళా, భద్రరూపిణీ, ప్రభావరూపిణీ, సోమ సూర్యాగ్ని రూపిణీ అవుతున్నది. సామరూపిణిగా ఓషధులను పుట్టించుచున్నది. కల్పవృక్ష, పుష్ప, ఫల, లతా గుల్మాత్ములగు ఔషధ భేష జాత్మికగా నున్నది. అమృత రూపములో దేవతలకు మహాస్తోమ ఫలములనిచ్చుచున్నది. దేవతలకు అమృత రూపముగను, మానవులకు అన్నరూపముగను, పశువులకు తృణముచేతను, జీవులకు అనేక విధములుగా ఆహారమును ప్రసాదిస్తున్నది.

సూర్యాదులతో సకల భువనములను ప్రకాశింపజేస్తున్నది, రాత్రింబవళ్ళ రూపమున కాలరూపముతో కలా నిమేషము మొదలుకొని ఘడియ జాము పగలు రాత్రిభేదములతో పక్ష, మాస, ఋతు అయన సంవత్సర భేదములతో మనుష్యులకు శతసంవత్సర కల్పనతో ప్రకాశిస్తున్నది, చిర క్షిప్ర రూపములో నిమేషము నుండి పరార్థము వరకు కాలచక్రమును చక్రములాగా త్రిప్పుచు తనయొక్క కాలవిభాగ విశేషముతో ప్రకాశిస్తూ ఆ దేవి కాలరూప అవుతున్నది.

ఆ దేవి అగ్నిరూపము గలదియై ప్రాణులకు ఆకలి దాహము రూపములోను (అన్నపానాది రూపములో), దేవతలకు ముఖరూపములోను, వనౌషధులకు శీతోష్ణరూపములోను, కాష్ఠముల లోపల బైట నిత్యానిత్య రూపములోను ఉంటుంది.

శ్రీదేవి మూడురూపాలు ధరించి, భగవంతుని సంకల్పము ప్రకారము, లోకములను రక్షించటం కోసం ఆ రూపాన్ని ధరిస్తూ ఉంటుంది. శ్రీ అనియు, లక్ష్మి అనియు, లక్షింపబడును. భూదేవి సప్తసాగరాంభస్సుగను, సప్తద్వీపా వసుంధరగను, భూరాది 14 భువనములకు ఆధారాధేయ ప్రణవాత్మికా రూపముగను ఉంటుంది. నీళాదేవి ముఖవిద్యున్మాలినియై సకల ఓషధులకు, ప్రాణులకు పోషణము

నిమిత్తమై సర్వస్వరూపగా ఉంటుంది. దేవి సమస్త భువనములకు అథోభాగమున జలాకారాత్మికగా మండూకరూపములో భువనాధారముగా ఉంటుంది.

(క్రియాశక్తి యొక్క స్వరూపము) శ్రీహరియొక్క ముఖము నుండి నాదాన్ని, ఆ నాదము నుండి బిందువును, ఆ బిందువు నుండి ప్రణవాన్ని ఓంకారమునకు చివర రామ వైఖానస పర్వతమును, ఆ పర్వతమునకు కర్మజ్ఞానమయమగు ఉపశాఖలు వచ్చాయి. ఆ చోట త్రయీమయరూపములో సర్వార్థ దర్శనమేర్పడును. ఋక్ యజుస్సామములను మూడు వేదములను త్రయీ అంటారు. కార్యసిద్ధి నిమిత్తమై నాలుగవ వేదమేర్పడి యున్నది. వీటిని ఋగ్యజుస్సామాంగిరసములు అంటారు. చాతుర్హోత్ర ప్రధానములగుట వలన లింగాది త్రితయము త్రయీ అవుతున్నది. అథర్వాంగిరసరూపము గూడ, సామ ఋగ్యజురాత్మకమే యగును. అభిచారభేద సామాన్యముతో ప్రత్యేకముగా దర్శనమవుతున్నాయి. ఋగ్వేదము 21 శాఖలతో ఉన్నది. యజుర్వేదము 109 శాఖలతో ఉన్నది. సామవేదము 1000 శాఖలతో ఉన్నది. అథర్వణవేదము 50 శాఖలతో ఉన్నది. ముందుగా వైఖానస దర్శనము ప్రత్యక్ష దర్శనముగా నున్నది. ఋషులందరు మొట్టమొదట వైఖానస దర్శనాన్ని స్మరించెదరు. ఆ తరువాత కల్పము, వ్యాకరణము, శిక్ష, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు ఇవి షడంగములు (వేదాంగములు) మరియు ఉపాంగములు మీమాంస, న్యాయములై ఉన్నాయి. ధర్మమును తెలిసికొనటానికి వేదవేదాంగములన్నింటి కంటే అధికముగ సమయానుకూలముగ ధర్మశాస్త్రాదు లేర్పడినాయి. మునీశ్వరుల అంతః కరణ ప్రవృత్తియే ధర్మశాస్త్రమై ఉన్నది. ఓ మునీ ! ఇంకా ఇతిహాస పురాణాలు ఉపాంగములుగ ఉన్నాయి. వాస్తువేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, ఆయుర్వేదము, మునివేదము ఈ 5 వేదములును ఉపవేదాలు. దండము, నీతి, వార్త, విద్య, వాయుజయము. వీటితో 21 రూపములుగ స్వప్రకాశములై శాస్త్రములున్నాయి. వైఖానస మహర్షికి పూర్వము శ్రీ మహావిష్ణువు యొక్క వాక్కు ప్రభవించింది. మూడు వేదముల (త్రయీ) రూపములో సంకల్పించి, ఈ రీతిగా దేహి విజృంభిస్తున్నది. వైఖానస మహర్షికి ముందుగా సాంఖ్యశాస్త్ర రూపములో, ఏ రీతిగా అది పుట్టినదో దానిని గురించి వివరిస్తాను. (ఇతిహాస పురాణములు పంచమ వేదమని చెప్పెదరు.)



ఆ క్రియాశక్తి ఉత్తమమగు బ్రహ్మమయ రూపము; సాక్షాత్తు బ్రహ్మము యొక్క శక్తి స్మరించినంత మాత్రముననే ఆవిర్భావ ప్రాదుర్భావాత్మికగా అనుభవము నిస్తుంది. ఆ దేవి నిగ్రహానుగ్రహరూప; శాంతిరూప, తేజోరూప, వ్యక్తావ్యక్త కారణచరణ, సమగ్రావయవరూపంలో భేదా భేదరూపముగ ప్రకాశిస్తుంది. భగవంతుడికి సహచారిణిగ నుండును. అనపాయిని, అనవరతము సహాయాశ్రయములను ప్రసాదించుదేవి జన్మించియు జన్మించనట్లుంటుంది. నేత్రములు మూసికొని తెరచుకొన్నంత సమయములో సృష్టి, స్థితి, సంహార, తిరోధాన అనుగ్రహాది సర్వశక్తులను ప్రదర్శింపగలదేవి. సమర్థతలో సాక్షాత్ శక్తిగా ప్రస్తుతింపబడుతున్నది.

ఇచ్ఛాశక్తి మూడు విధములుగా నున్నది. ప్రళయ కాలములో విశ్రాంతి చెందుటను భగవంతుని దక్షిణ వక్షస్థలము నందు శ్రీవత్సాకారములో ఆ యోగశక్తి విశ్రమిస్తుంటుంది. భోగశక్తి భోగరూపములో, కల్పవృక్ష, కామధేను, చింతామణి, శంఖపద్మాది నవనిధులను ఆశ్రయించి ఉంటుంది. భగవదుపాసకులకు కామమతో గాని, అకామముతోగాని, భక్తియుక్తులగు మానవులకు నిత్యనైమిత్తిక కర్మలతోను అనుగ్రహిస్తుంది. మరియు భక్తులు అగ్నిహోత్రాదులతోను, యమనియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులచేత, గోపుర ప్రాకారాదులచేత, విమానాదులచేత, భగవద్విగ్రహార్చా పూజా కర్మస్నానాదుల చేత, పితృపూజాదులచేత, అన్నపానాదులచేత, భగవత్ ప్రీత్యర్థమని చెబుతూ సర్వారాధనలను చేస్తున్నారు.

ఆ పిమ్మట ఆ సీతాదేవి వీరశక్తియుత చతుర్భుజయై, అభయవరద పద్మములను గలిగియున్నదై, కిరీటాద్యాభరణములను ధరించియున్నదై, సర్వదేవతాపరివృతయై, కల్పవృక్షమూలమున నాలుగు ఏనుగులు రత్నఘటముల యొక్క అమృతజలములతో అభిషేకము చేస్తుండగా ప్రకాశిస్తూ, సమస్త దేవతలచేత బ్రహ్మాదులచేత వంద్య మానయై, అణిమాద్యష్టైశ్వర్య శోభితయై, సమ్ముఖమున కామధేనువుచే స్తుతింప బడుచున్నదియై, వేదశాస్త్రములచే ప్రస్తుతింపబడుచున్నదై, జయాద్యప్సరస స్త్రీలచే పరిచర్యలనందుకొనుచున్నదై, సూర్యచంద్రులను దీపములచే ప్రకాశింపబడుచున్నదై, నారద తుంబురాదుల యొక్క గానముతో నుతింపబడుచున్నదియై, స్వాహా స్వధాదులనువారల వ్యజనముతో పూజింపబడుచున్నదియై, భృగువు మున్నగు పుణ్యపురుషులచే నర్చింపబడుచున్నదియై, దివ్య సింహాసనాసీనురాలై, సకల

కారణకార్యకారియగు లక్ష్మీదేవి యొక్క భవనమునకు వేరుగా స్థిరముగా నున్నదియై, ప్రసన్నలోచనయై, సర్వదేవతా పూజ్యమానయై, వీరలక్ష్మి యను పేరుతో ప్రసిద్ధిగానున్నది.

**8. సరస్వతీ రహస్యోపనిషత్తు :** ఇది యజుర్వేదంలోది. ఇందులో మునులందరూ అశ్వలాయ నుండి దగ్గరకు వెళ్ళి సారస్వప్రాప్తి కావాలంటే ఏ దేవతని ప్రార్థించాలి? ఏ విధంగా ఉపాసించాలి ? అని అడుగుతారు. అప్పుడు అశ్వలాయనుడు వారికి సరస్వతీ ఉపాసన అంతా వివరిస్తాడు.

**9. లలితారహస్యోపనిషత్తు :** ఇది నాకు స్వప్న దర్శనమైన ఉపనిషత్తు. ఇది మొత్తం ఏడు అధ్యాయాలుగా ఉంటుంది. మొదటి అధ్యాయంలో పరమేశ్వరితత్త్వాన్ని వివరించమని దేవతలంతా బ్రహ్మని అడుగుతారు. అప్పుడాయన ఈ చరాచర జగత్తును సృష్టించినది ఆ పరమేశ్వరి. ఆవిడే సృష్టి స్థితి సంహారకారిణి. సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్నంతటినీ పరమేశ్వరి ఆవరించి ఉన్నది. పరమేశ్వరికి రెండు రూపాలున్నాయి. 1. నిరాకారము 2. సాకారము. సృష్టి ప్రారంభానికి ముందు ఆవిడ నిరాకారంగా ఉండేది. ఆ పరమేశ్వరి నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. మళ్ళీ ఆవిడలోనే లయమవుతున్నది. ఆదేవి వల్లనే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రాది దేవతలు, అష్టవసువులు, దిక్పాలకులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, మరుత్తులు అందరూ ఉద్భవించారు. ఆ పరమేశ్వరివల్ల ఒక్క దేవతలే కాదు, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, నాగగణాలన్నీ ఆవిర్భవించాయి.

ఆ పరమేశ్వరియే సత్యమైనది, నిత్యమైనది శాశ్వతమైనది. భూమి, ఆకాశము, దశదిశలు, పైభాగము, క్రింది భాగము, మధ్యభాగము అంతా పరమేశ్వరి స్వరూపమే. నేల నీరు, నింగి అంతా పరమేశ్వరియే. ఆమె అద్వితీయము, అనన్యము, అజరామరము అయినది. ఆది మధ్యాంత రహితమైనది. ఆమె గతంలో (భూతకాలంలో) ఉన్నది. వర్తమానంలో ఉన్నది, భవిష్యత్తులో ఉంటుంది. త్రికాలరూపి ఆమె, త్రికాలాతీతమైనది ఆమె. ఆమెతో సమానమైన వారుగాని, అంతకు మించిన వారుగాని, ఎవరూ లేరు. ఆమె కామకళ, శృంగారకళ, సాదాఖ్యకళ. అండజాలు,



శ్వేదజాలు, ఉద్భిజాలు, స్థావరాలు, జంగమాలు, పశువులు, పక్షులు, జంతువులు అన్నీ ఆమెవల్లనే ఆవిర్భవించాయి. ఆమెయే పరాశక్తి. శాంభవి. కాదివిద్య, హాదివిద్య ఆమెయే. ఆవిడే త్రిపురసుందరి. ఆ పరమేశ్వరియే ఈ జగసృష్టికి కారకురాలు" అంటూ పరమేశ్వరి తత్త్వాన్ని వివరించాడు.

| | | |
|---|---|---|
| రెండవ అధ్యాయంలో | – | జగసృష్టి |
| మూడవ అధ్యాయంలో | – | స్థూలశరీరము |
| నాల్గవ అధ్యాయంలో | – | మాయా స్వరూపము |
| ఐదవ అధ్యాయంలో | – | మంత్రము |
| ఆరవ అధ్యాయంలో | – | యంత్రము |
| ఏడవ అధ్యాయంలో | | |

దేవతలారా ! పరమేశ్వరి అర్చనావిధానం రెండురకాలుగా ఉంటుంది. 1.బాహ్యపూజ 2. అంతఃపూజ. బాహ్యపూజ అంటే పరమేశ్వరి ప్రతిమను గాని, ఆమెకు ప్రతిరూపమైన యంత్రాన్నిగాని ఎదురుగా ఉంచుకుని, దేవత వేరు, నేను వేరు అనే భావంతో పూజించటం. ఇది లౌకికవాదులు చేస్తారు. ఇక రెండవది అంతఃపూజ. సాధకుడు తన శరీరాన్నే శ్రీచక్రంగా భావించి, తానే పరమేశ్వరి స్వరూపాన్ని అనే భావనతో అర్చన చేస్తాడు. ఇది ముక్తికి మార్గము. ఇది కేవలము జ్ఞానులకు మాత్రమే సాధ్యము.

సాధకుడు నేను, నాది అనే అహంకార మమకారాలను వదలి వెయ్యాలి. అరిషడ్వర్గాలను జయించాలి. అప్పుడు ఈ జగత్తంతా ఒకటిగానే కనిపిస్తుంది. అందులో తేడాలుండవు. తరతమ భేదాలుండవు. అటువంటి స్థితిలో ఈ సృష్టి అంతా నావల్లనే జరుగుతోంది. సృష్టిస్థితి లయ కారకుడను నేనే. ఈ జగత్తు అంతా నాలోనే ఇమిడి ఉన్నది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు అన్నీ నానుంచే ఆవిర్భవిస్తున్నాయి. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని త్రికరణశుద్ధిగా భావిస్తాడు. అటువంటివాడే జ్ఞాని.

అమృతపానం చేసేవాడికి పాలతో ప్రయోజనం ఉండదు. అలాగే జ్ఞానమనే అమృతాన్ని సంపాదించిన వాడికి కర్తవ్యము ఏదీ ఉండదు అతడు ఆత్మ జ్ఞాని,

తత్త్వవేత్త, అనబడతాడు. అతడు అంతటా వ్యాపించ గలుగుతాడు. అతడు శరీరము ధరించి ఉన్నప్పటికీ, శరీరము లేనివాడిగానే లెక్క. అతడు సర్వసన్యాసి. సర్వసంఘ పరిత్యాగి. ఒంటి మీద బట్టలు కట్టుకోడు, స్నానం చెయ్యడు. తిండి తినడు, నీరు త్రాగడు. ఒకచోట స్థిరంగా ఉండడు. పిచ్చివాడిలాగా దేశాల వెంట తిరుగుతుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఒంటరి జీవనం చేస్తుంటాడు. ఎక్కువగా అరణ్యాలలోను, ఒంటరి ప్రదేశాలలోనూ సంచరిస్తూ నిరంతరము ఆత్మధ్యానం చేస్తుంటాడు. అతడికి సంకల్ప వికల్పాలుండవు. అతడు సర్వశాస్త్ర పండితుడు. కాని ఏమీ తెలియనివాడు. శిష్టాచారుడు. కాని ఏ ఆచారము పాటించడు. కర్మలు చెయ్యటంలో నిష్ణాతుడు. కాని ఏ కర్మలు చెయ్యడు. భూత భవిష్యద్వర్తమానాలు పూర్తిగా తెలిసినవాడు. కాని ఏమీ తెలియనివాడు. తనలో తాను మాట్లాడుకుంటూ ఉంటాడు. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు. జీవన్ముక్తుడు. ఈ శరీరాన్ని వదలి గాలిలోగాలిలాగా, నీటిలో నీరులాగా, కాంతిలో కాంతిలాగా పరమాత్మలో లీనమవటానికి సిద్ధంగా ఉన్నవాడు. పండిపోయి రాలిపోవటానికి సిద్ధంగా ఉన్నవాడు. విదేహముక్తి లభించగానే అంటే దేహాన్ని విడిచిపెట్టగానే పరమాత్మలో లీనమవుతాడు. అదే మోక్షము, అదే సాయుజ్యము, అదే కైవల్యము. అదే ముక్తి. జీవాత్మ పరమాత్మల ఏకీభావము.

దేవతలారా ! ముక్తి అంటే విముక్తి. అదే ఐహిక బంధనాల నుండి విముక్తి పొందటం. మానవుడికి ఉన్న శత్రువులలో ముఖ్యమైనవి రాగద్వేషాలు. రాగము అంటే అనురాగము. ఏదైనా ఒకవస్తువు పట్ల లేదా ఒక వ్యక్తిపట్ల ఉండే అపేక్ష. బలమైన కోరిక. ఆ కోరిక తీరకపోతే, ద్వేషం పెరుగుతుంది. రాగము అనేది జీవిని బంధించి వేస్తుంది. ద్వేషము ఇంకొకరిని బాధిస్తుంది. ఇవి ఉన్నంతవరకు మానవుడు దేన్నీ సాధించలేడు. అసత్యాన్ని సత్యమనుకుని భ్రమపడుతుంటాడు. అందుచేత ముందుగా రాగద్వేషాలను జయించాలి. మనసును పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. మనస్సే సంకల్ప వికల్పాలకు కారణం. కాబట్టి మనసును జయించాలి. మనసును నశింపచెయ్యాలి. అమనస్కయోగము సాధించాలి. అమనస్కయోగము సాధించినవాడే మహాజ్ఞాని. సాక్షాత్తు పరమేశ్వరుడు. ఈ ఉపనిషత్తును విన్నంత మాత్రంచేతనే జన్మజన్మల పాపము నశించి పరమేశ్వరి అనుగ్రహం కలుగుతుంది.



# 4. శ్రీవిద్యా మహామంత్రము

స్త్రీ దేవతలకు సంబంధించిన మంత్రాలన్నీ శ్రీవిద్యా సంబంధమైన మంత్రాలే. వీటిలో బాల, పంచదశి, షోడశి మంత్రాలు ముఖ్యమైనవి. వీటిలో కూడా పంచదశి మహామంత్రము చాలా ముఖ్యమైనది. ముందుగా అసలు మంత్రము అంటే ఏమిటో చూద్దాం.

**దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతమ్ ।**
**తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణో మమదేవతా ॥**

చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరుని అధీనంలో ఉన్నది. ఆ పరమేశ్వరుడు మంత్రానికి అధీనమై ఉన్నాడు. ఆ మంత్రము బ్రాహ్మణుని అధీనంలో ఉన్నది. అందుకే బ్రాహ్మణుడు దైవస్వరూపుడు, భూసురుడు అనబడుతున్నాడు. అందరూ అనుకుంటూఉంటారు బ్రాహ్మణుని ఆధిక్యత ఏమిటి ? అని. నిజమే ఏమీలేదు.కాని అతడు ఉన్నంతవరకే ధర్మము, న్యాయము, సంప్రదాయము అనేవి ఉంటాయి. అతడు పతనం అయినరోజున ఇవిఏవీ ఉండవు. అందుకే బ్రాహ్మణుడైనవాడు బుద్ధికలిగి తనవిధులు తాను సక్రమంగా నిర్వర్తించాలి. అప్పుడే **'బ్రాహ్మణో మమదేవతా'** అనే పదానికి అర్థం సార్థకమవుతుంది.

**మననాత్త్రాయత ఇతిమంత్రః** మననము వలన, మననము చేయు వానిని రక్షించునది మంత్రము. దేవతల దయకు పాత్రులు కావాలంటే మంత్రజపం చెయ్యాలి. దీన్నే 'ఉపాసన' అంటారు. ప్రాచీనకాలం నుంచీ మనదేశంలో అనేకమైన ఉపాసనా మార్గాలున్నాయి. వీటిలో గాణాపత్యం, శైవం, వైష్ణవం, శాక్తేయం వంటివి ఎక్కువ ప్రాచుర్యం పొందినాయి. శక్తిని ఆరాధించే వారిని 'శాక్తేయులు' అంటారు. శాక్తేయంలో అనేక మార్గాలున్నాయి. వీటిలో శ్రీవిద్య బహుళప్రాచుర్యం పొందింది. శ్రీవిద్యనే "చంద్రకళావిద్య" అని కూడా అంటారు. శ్రీవిద్యలో పంచదశీ మహామంత్రం ముఖ్యమైనది.

అరణిమథిస్తే అగ్ని ఎలా పుడుతుందో, అలాగే మంత్రాన్ని జపించినట్లైతే శక్తి పుడుతుంది. ఆ శక్తి సాధకుడికి సర్వార్థాలూ చేకూరుస్తుంది. బీజాక్షరాలచేత సంపుటం

చేయబడిన మంత్రజపం వల్ల దేవతానుగ్రహం త్వరగా కలుగుతుంది. ఆయా దేవతలయొక్క తత్త్వాలకు అనుగుణమైన బీజాక్షరాలు మంత్రాలకు సంపుటీకరణ చేయబడ్డాయి. బీజాక్షరాలు అంటే ఎక్కడి నుంచో ప్రత్యేకంగా రాలేదు. భాషకు ఉన్న యాభై ఒక్క అక్షరాలు ద్విత్తాలుగా, సంయుక్తాక్షరాలుగా, రకరకాలుగా ఉంటాయి. ఇందులో మూలము సంస్కృత భాషలోని అక్షరాలే అని గ్రహించాలి.

పరమేశ్వర బీజం 'ఓం'కారము. అలాగే ఈం లక్ష్మీబీజము, ఐం వాగ్బీజము, క్లీం మన్మథబీజము, హ్రీం శక్తిబీజము, గం గణపతిబీజము, ఈ రకంగా దేవతలకే కాక పంచభూతాలకు కూడా బీజక్షరాలున్నాయి. లం పృథివీబీజము. హం ఆకాశబీజము. యం వాయుబీజము. రం అగ్నిబీజము, వం అమృతబీజము.

ప్రతిమంత్రంలోనూ దేవతపేరు, ఆ దేవతకు సంబంధించిన బీజాక్షరాలు ఉంటాయి. మనం అనేక రకాలయిన యంత్రాలను చూస్తుంటాము. ప్రతి యంత్రంలోను ఆయా దేవతలకు సంబంధించిన మంత్రాలు, బీజాక్షరాలు ఉండటాన్ని గమనించవచ్చు. మంత్రాలలో పంచదశీ మహామంత్రానికి ఒక ప్రత్యేకత ఉన్నది. దీనిలో బీజాక్షరాలు మాత్రమే ఉంటాయి. ఏ దేవత పేరూ ఉండదు. అలాగే పంచదశీ మహామంత్రానికి యంత్రరూపమైన శ్రీచక్రానికి కూడా ఒక ప్రత్యేకత ఉన్నది. దీనిలో మిగిలిన యంత్రాలలోలాగా దేవత పేరుగాని, బీజాక్షరాలుగానీ ఉండవు. ఇది కేవలము రేఖానిర్మితము. మంత్రాలు మూడు రకాలు.

1. వైదికములు 2. తాంత్రికములు 3. అపభ్రంశములు. వేదాలలో చెప్పబడ్డ మంత్రాలను 'వైదిక మంత్రాలు' అంటారు. ఇవి జ్ఞానప్రదాలు. కామ్యప్రదమైనవి 'తాంత్రికాలు'. సంస్కృతంలో కాకుండా, ఇతర భాషలలో గల మంత్రాలు 'అపభ్రంశములు' మళయాళ మంత్రాలు, తెలుగు, హిందీ, పార్శీ మొదలైన భాషలలోని మంత్రాలు, ఇవి అపభ్రంశములు.

**వైదికా: ప్రణవైర్యుతాః ప్రణవేన విహీనంతు తాంత్రికా ఏవః ప్రకీర్తితా**

ఓంకారము గలవి వైదికమంత్రాలనీ, ఓంకారము లేనివి తాంత్రికాలు అని చెప్పబడుతున్నాయి.



మంత్రాలను స్త్రీ, పురుష, నపుంసక మంత్రాలు అని మూడు రకాలుగా విభజించవచ్చు. మంత్రంలో 'స్వాహా' అనే పదము చివరి గలవి స్త్రీ మంత్రాలు. 'హుంఫట్' అనే పదము చివర గలవి పురుష మంత్రాలు. 'నమః' అనే పదము చివర గలవి నపుంసక మంత్రాలు. అయితే పురుషదేవతలను ఉపాసించే వాటిని మంత్రాలనీ, స్త్రీదేవతలను ఉపాసించే వాటిని **'విద్య'** అని అంటారు. వీటిలో ఒక అక్షరము కలవాటిని **'పిండము'** అని, మూడు అక్షరాలు గలవాటిని **'కర్తరులు'** అని, మూడు నుంచి తొమ్మిది వరకు అక్షరాలుగల వాటిని **'బీజములు'** అని, పది నుంచి ఇరవైవరకు గలవాటిని **'మంత్రాలు'** అని, ఇరవైకన్న ఎక్కువ అక్షరాలున్న మంత్రాలను **మాలామంత్రాలు** అంటారు. వైదిక మంత్రాలు సమయాచారినికి, తాంత్రిక మంత్రాలు కౌళాచారానికి సంబంధించినవి. తాంత్రిక మంత్రాల వల్ల అనేక ఇబ్బందులు కూడా ఉన్నాయి. అందుకే సాధకులు ఎల్లప్పుడూ వైదిక మంత్రాలనే జపించాలి. సప్తకోటిమంత్రాలలో ప్రధానమైనవి వైదికమంత్రాలే.

శ్రీవిద్యలో పంచదశీ మహామంత్రము ప్రసిద్ధమైనది. శాక్తేయానికి ఇది గాయత్రి వంటిది. గాయత్రీమంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం 'నాలుగు వర్ణాలవారికీ ఉపాశ్య' అని అగస్త్యమహర్షి వ్రాసిన **'శ్రీవిద్యాదీపిక'** అనే గ్రంథంలో చెప్పబడింది. కాబట్టి పంచదశీమహామంత్రాన్ని బ్రాహ్మణులు ఒక్కరే చెయ్యాలా? మిగిలిన వారెవరూ చేయరాదా ? అనే అనుమానాలు అక్కరలేదు. ఈ మంత్రం ఏ జాతివారైనా, ఏ కులంవారైనా, ఏమతంవారైనా చెయ్యవచ్చు. అయితే ఒక మంచి గురువు దగ్గర ఉపదేశం పొంది మంత్రాన్ని చేస్తే ఫలితము ఉంటుంది. మంత్రజపం చేసేటప్పుడు పూర్తి ఫలితం రావాలి అంటే మనం చేసే మంత్రముయొక్క పూర్వాపరాలు, దానిఅర్థము, మంత్రాధిష్ఠానదేవత. ఇవన్నీ క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. ఏ మంత్రమైనా సరే, అర్థం పూర్తిగా తెలుసుకుని మాత్రమే జపం చెయ్యాలి. లేకపోతే ఆ ఉపాసనకు ఫలితముండదు. మంత్రార్థం తెలియని జపం వ్యర్థం.

**నార్థజ్ఞాన విహీనంచ శబ్ద స్యోచ్చారణం ఫలతి ।**
**భస్మని వహ్ని విహీనేన న ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥**

అగ్నిహోత్రము లేనటువంటి బూడిదలో గనక నెయ్యి మొదలైన హోమద్రవ్యాలు వేసినట్లైతే ఏ రకంగా వ్యర్థమైపోతాయో, అలాగే అర్థం తెలియకుండా చేసిన మంత్రజపం కూడా వ్యర్థమై పోతుంది.

**అర్థమజానానాం నానావిధ శబ్దమాత్ర పాఠవతామ్ ।**
**ఉపమేయశ్చక్రీవాన్ మలయజ భారస్య ఓఢైవ ॥**

అర్థం తెలియకుండా కేవలము శబ్దము మాత్రమే పలికేవాడు మంచి గంధపు చెక్కలు మోస్తూ వాటి వాసనను గ్రహించలేని గాడిదవంటివాడు. ఎన్ని గంధపు చెక్కలు మోసినప్పటికీ వాసన తెలియకపోతే గాడిదకు ఏరకంగా ఉపయోగం లేదో, అలాగే సాధకుడికి అర్థం తెలియకుండా చేసిన జపంవల్ల ఫలితము ఏమీ ఉండదు. చతుర్విధపురుషార్థాలు సాధించటానికి మంత్రార్థము ముఖ్యమైనది. వేదాలు, శాస్త్రాలు, తంత్రాలు, కర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండలను ఉపదేశించే వారు మంత్రార్థము తెలుసుకుని ఉపదేశము, అనుష్టానము చేసినట్లైతే మంచి ఫలితము ఉంటుంది. అర్థం తెలియకుండా విపరీతసాధన చేసినట్లైతే ఫలితం లేకపోగా, అనర్థం కూడా జరుగుతుంది. ఉదాహరణకు 'రక్షమాం' అనేచోట రకు బదులుగా పొరపాటున 'భ' అని చెప్పామనుకోండి అప్పుడు 'భక్షమాం' అవుతుంది. అంటే మంత్రాధిదేవత సాధకుడి కోరిక ప్రకారం అతన్నే భక్షిస్తుంది. అందుచేత, మంత్రార్థాన్ని పూర్తిగా తెలుసుకుని తప్పులు లేకుండా మంత్రాన్ని సరిగా జపించాలి. ఇక ఈ మంత్రాన్ని చూద్దాం.

పంచదశీమహామంత్రము పదిహేనుఅక్షరాలు గల మంత్రము. ఇహాన్ని కలుగచేసేవి, అంటే లౌకికమైన కోరికలు తీర్చేవి మంత్రాలు. పరాన్ని కలుగచేసేవి మహామంత్రాలు. పంచదశీమహామంత్రం ఇహాన్ని, పరాన్ని కూడా కలుగజేస్తుంది. ఈ మంత్రంలో పదిహేను అక్షరాలు ఉంటాయి. ఈ మొత్తం అక్షరాలు మూడు భాగాలుగా ఉంటాయి. వీటినే మూడుకూటములు, మూడుఖండములు అని కూడా అంటారు. పరమేశ్వరి యొక్క సూక్ష్మశరీరమే పంచదశీ మహామంత్రము.

**స్థూలశరీరము :** పాంచభౌతికమైనది ఈ దేహము. ఇది మూడు రకాలుగా ఉంటుంది. 1. స్థూలశరీరము 2. సూక్ష్మశరీరము 3. కారణశరీరము. వీటిలో



చర్మము, మాంసము, రక్తము, నరాలు, మేద, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడిన ఈదేహాన్ని 'స్థూలశరీరము' అంటారు. ఇది అసహ్యకరమైనది. పూర్వకర్మల ననుసరించి, పంచభూతాల కలయికచేత ఈ దేహం ఏర్పడింది. భోగాలు అనుభవించటానికి ఆధారము ఈదేహమే. జీవుడు ఈశరీరంతోనే సుఖదుఃఖాలు భోగభాగ్యాలు అనుభవిస్తాడు. స్థూలశరీరం జాగ్రదావస్థలో అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలు దానికి తెలియవు. గృహస్థుకు గృహంలాగా జీవాత్మకు ఈ శరీరం ఆవాసమై ఉన్నది. జీవిచేసిన పాపపుణ్యాలన్నీ ఈశరీరం ద్వారానే అనుభవిస్తాడు. జననము, మరణము, ముసలితనము, రోగము, అన్నీ ఈశరీరానివే. బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము మొదలైనదశలు కూడా ఈశరీరానివే. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము వంటి ఆశ్రమధర్మాలు ఈశరీరానివే అలాగే యమనియమాలు, మానావమానాలు మొదలైన విశేషాలు కూడా ఈ శరీరానికి సంబంధించినవే.

**సూక్ష్మశరీరము :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, విద్య, కామము, కర్మ ఇవన్నీ కలిసి సూక్ష్మశరీరం అనబడుతున్నది. దీన్నే లింగశరీరము అనికూడా అంటారు. ఇది అపంచీకృత భూతాలవలన ఏర్పడి, వాసనలతో కూడినదై, కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈసూక్ష్మశరీరమే అనుభవిస్తుంది.

**కారణ శరీరము :** గుణత్రయమే ఆత్మయొక్క కారణశరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్నిరకాలయిన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో ఉంటుంది. ఆస్థితిలో శరీరంలోని అన్నిఅవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి.

ఇప్పుడు దేవియొక్క సూక్ష్మరూపాన్ని వర్ణిస్తున్నారు. సూక్ష్మరూపము మూడు విధాలుగా ఉంటుంది.

1. సూక్ష్మము – పంచదశీ మహామంత్రము
2. సూక్ష్మతరము – కామకలాక్షరము
3. సూక్ష్మతమము – కుండలిని

లలితా సహస్రంలోని 85, 86, 87 నామాలలో పంచదశీమహామంత్రాన్ని వివరించారు. **శ్రీమద్వాగ్భవకూటైకస్వరూప ముఖపంకజా, కంఠాదికటిపర్యంతం మధ్యకూటస్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణః**

## 85. శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా

పంచదశీ మహామంత్రం మూడుభాగాలుగా ఉంటుందని ముందే చెప్పాం. వీటిలో మొదటిభాగంలో నాలుగు, రెండవభాగంలో ఐదు, మూడవభాగంలో మూడు బీజాక్షరాలు ఉంటాయి. ఈ భాగాలనే ఖండాలు లేదా కూటములు అంటారు. ప్రతిఖండానికి చివర హ్రీం కారముంటుంది. ఈరకంగా పంచదశీమహామంత్రంలో పదిహేను బీజాక్షరాలు ఉంటాయి. ఈ ఖండాలకు విడివిడిగా పేర్లున్నాయి.

1. ప్రథమఖండాన్ని - వాగ్భవకూటమి
2. ద్వితీయఖండాన్ని - కామరాజకూటమి
3. తృతీయఖండాన్ని - శక్తికూటమి అంటారు.

**1. వాగ్భవకూటమి :** ఇది ఋగ్వేదాత్మకము. దీనివల్ల పురుషార్థసాధనచేత కలిగే బ్రహ్మవర్చస్సు, సద్బుద్ధి కలుగుతాయి. ఇందులో గాయత్రీమంత్రసారము చెప్పబడింది.

**2. కామరాజకూటమి :** ఇది యజుర్వేదాత్మకము. దీనిలో అర్థకామపురుషార్థ నిర్మాణము, క్షత్రియులచే ఉపాసింపబడు త్రిష్టచ్ఛందస్సు ఉన్నాయి.

**3. శక్తికూటమి :** ఇది సామవేదాత్మకము. ఇందులో మోక్షసాధనకు మార్గము చెప్పబడింది.

పంచదశీమహామంత్రాన్ని అనేకచోట్ల ప్రతిపాదించటం జరిగింది. శంకర భగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 32వ శ్లోకంలోను, గౌడపాదులవారు సుభగోదయస్తుతిలోని 19వ శ్లోకంలోను ఇంకా అనేకమంది అనేకచోట్ల ఈ మంత్రాన్ని ప్రతిపాదించారు.

పరమేశ్వరి స్థూలరూపాన్ని మూడుభాగాలుగా విభజించారు. ఆ భాగాలనే కూటములు అంటారు.



1. తలభాగము మెడవరకు - వాగ్భవకూటమి
2. కంఠమునుండి కటివరకు - కామరాజకూటమి
3. కటి నుండి కాళ్ళ వరకు - శక్తికూటమి

**1. వాగ్భవకూటమి :** దీని నుంచే వాక్కు వస్తుంది. అందుచేతనే దీన్ని వాగ్భవకూటిమి అన్నారు. ఇందులోని ఐదుఅక్షరాల సమూహమే స్వరూపంగా గల ముఖపద్మము గలది ఆ పరమేశ్వరి. పరమేశ్వరి యొక్క కనులు, చెవులు, ముక్కు, నోరు, కంఠము – వాగ్భవకూటమి. ఈ కూటమిలో **క ఏ ఈ ల హ్రీం** అనే ఐదు బీజాక్షరాలుంటాయి. బాలమంత్రంలోని ఐం బీజము వాగ్భవము. వాగ్బీజాన్ని ఉపాసిస్తూ దుర్వాసుడు. తన శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 3వ శ్లోకంలో

**వందే వాగ్భవ మైందవాత్మ సదృశం వేదాది విద్యగిరో**
**భాషా దేశ సముద్భవాః పశుగతా శ్ఛందాంసి సప్తస్వరాన్ ।**
**తాలా న్పఞ్చ మహాధ్వనీ ‌స్ప్రకటయ త్యాత్మ ప్రసారేణ యత్**
**తద్బీజం పదవాక్యమానజనకం శ్రీమాతృకే తే పరమ్ ॥**

ఓ పరాత్పరీ ! నీ రూపమే అయినటువంటి వాగ్భవబీజమునకు నమస్కరించు చున్నాను. ఈ బీజము శ్వేతవర్ణము గలది. అది తన వ్యాప్తిచేతనే వేదాదిసకల విద్యలను, సకలవాక్కులను, సకలభాషలను, సకల ఛందస్సులను, సప్తస్వరాలను, తాళములను, ధ్వనులను ప్రకాశమొనర్చుచున్నది. ఇంత మహాశక్తి. శాలి, పరము అయిన వాగ్భవబీజాన్ని నేను ఉపాసిస్తున్నాను అన్నాడు.

## 86. కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ

**కంఠస్య అధః కటి పర్యంతోయస్య స మధ్యభాగః**
**స ఏవ మధ్యస్య కామరాజాఖ్యస్య కూటస్య**

కంఠస్థానము నుండి కటి ప్రదేశము వరకు గల మధ్యభాగము కామరాజ కూటమి. దీనిలో ఆరు బీజాక్షరాలుంటాయి. ఇక్కడ బాహుసంధులు, కటిసంధులు, నాభి, హృదయము. ఇవే ఈ కూటమిలోని బీజాలు. **హ స క హ ల హ్రీం**

బాలమంత్రంలోని క్లీం అనే అక్షరము కామరాజబీజము. ఈ భాగాన్ని ఉపాసనచేస్తూ దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 7వ శ్లోకంలో

**కామా న్కారణతాం గతా నగణితాన్ కార్యై రనేకై ర్మహీ**
**ముఖ్యైః సర్వమనోగతా నధిగతాన్ మానై రనేకైః స్ఫుటం**
**కామక్రోధసులోభమోహమదమాత్సర్యారి షట్కం చ య**
**ద్బీజం భ్రాజయతి ప్రణౌమి త దహం తే సాధు కామేశ్వరి ! ॥**

ఓ దేవీ ! కామరాజబీజము సృష్టి, స్థితి, లయాలను నిర్వర్తించు త్రిమూర్తుల శక్తులను ప్రకాశింపచేయును. పంచభూతాలు, తన్మాత్రలు, త్రిమూర్తులు, సృష్టి స్థితి సంహారాలను, ఆయాదేవతల శక్తులను గోచరింపచేయునది, అరిషడ్వర్గములను ప్రాణులయొక్క మనసు నందు ఉత్పన్నము చేయునది అయిన కామరాజబీజమునకు నమస్కరించుచున్నాను.

## 87. శక్తికూటైకతాపన్నకట్యధోభాగధారిణీ

కటిప్రదేశము నుంచి పాదాల వరకు గల భాగమును శక్తికూటమి అంటారు.

**కామస్తే హృదివసతీతి కామరాజం । స్రష్టృత్వాత్తదను తవాంబ శక్తికూటమి.**

కాముడు నీ హృదయమందు గలవాడు. కామరాజును సృష్టించుటచే అది నీ శక్తికూటమి అయినది.

పంచదశీమహామంత్రంలోని మూడవభాగము శక్తికూటమి. ఇందులో నాలుగుబీజాలుంటాయి. వీటిలో మొదటి రెండు బీజాలను మణిపూరస్వాధిష్టానాల మధ్యన, మూడవది మూలాధారంలోను, నాల్గవది స్వాధిష్టానంలోను ఉన్నట్లుగా భావించి ఉపాసించాలి. ఈ రకంగా చెయ్యటంవల్ల ఉపాసకులకు దేవతాభావసిద్ధి కలుగుతుంది. సత్పురుషులలో దాగినశక్తి ఈ కూటానికి మూలము. దీనిలోని బీజాక్షరాలు స క ల హ్రీం. బాలామంత్రంలోని మూడవబీజము సౌఃశక్తిబీజమే. దుర్వాసుడు ఈ కూటమిని ఉపాసిస్తూ శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 12వ శ్లోకంలో

**స్వాత్మశ్రీ విజితాజ విష్ణు మఘవ శ్రీపూర్ణనైకవ్రతం**
**యద్విద్యా కవితా వితానలహరీ కల్లోలినీ దీపకం ।**



**బీజం య త్రిగుణప్రవృత్తిజనకం బ్రహ్మేతి యద్యోగినః**
**శాంతా స్సత్య ముపాసతే త దిహ తే చిత్తే దధే శ్రీపరే ॥**

తల్లీ ! శక్తిబీజము త్రిమూర్తులరూపవిశేషాలను జయిస్తున్నది. వారు వారి పనులు సక్రమంగా నిర్వహించటానికి వారికి శక్తినిస్తుంది. ఉపాసకులకు విద్య కవిత్వము సిద్ధింపచేస్తుంది. త్రిగుణములప్రవృత్తిని కలిగిస్తుంది. యోగులకు సత్యాత్మకమైన బ్రహ్మము ఇదే. అట్టి నీ శక్తిబీజమును నేను ఉపాసింతును అంటాడు.

ఈ మంత్రం మొత్తం మూడు కూటములు లేదా ఖండములుగా ఉంటుంది. వాటిని 1. వాగ్భవకూటమి, 2. కామరాజకూటమి, 3. శక్తికూటమి అంటారు. పరమేశ్వరి యొక్క కంఠము నుంచి పైభాగము అంటే శిరస్సును వాగ్భవకూటమి అంటారు. శిరస్సునుంచే పరావాక్కు ఉత్పన్నమవుతుంది. నోటిద్వారా బయటకు వస్తుంది. అందుకే దీనిని వాక్కుయొక్కభాగము, వాగ్భవకూటమి అన్నారు. రెండవది కామరాజకూటమి. ఇది కంఠము దగ్గరనుంచి కటిప్రదేశము వరకు విస్తరించి ఉంటుంది. ఈ శరీరభాగంతోనే జీవి తనకోరికలు అనుభవిస్తుంది. అందుకే దీనిని మన్మథభాగము, కామరాజకూటమి అన్నారు. మూడవది శక్తికూటమి. కటిప్రదేశంలో నుంచి క్రిందిభాగము అంతా శక్తికూటమి. జీవి సంచరించటానికి అవసరమైన శక్తినిచ్చే కాళ్ళు ఇక్కడ ఉంటాయి. అందుకే ఇది శక్తికూటమి అనబడుతున్నది. ఈ రకంగా పరమేశ్వరి శరీరాన్ని మూడు భాగాలుగా జేసి వాటిని వాగ్భవకూటమి, కామరాజకూటమి, శక్తికూటమి అన్నారు. పరమేశ్వరికి శరీరము ఏమిటి ? అనే అనుమానం రావచ్చు. నిరాకారుడైన పరబ్రహ్మ, సాధకులను ఉద్ధరింప గోరినవాడై ఒక రూపం దాల్చాడు. అదే పరమేశ్వరి. పరలోకానికి ఈశ్వరి. అధిపతి ఆ పరమేశ్వరి సూక్ష్మరూపమే పంచదశీమహామంత్రము.

పంచదశీమహామంత్రము దేవికి ఆత్మస్వరూపము. శ్రీవిద్యా సంప్రదాయానికి ఇది గాయత్రివంటిది. ఈ మంత్రాన్ని ఉపాసించినవారికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. చతుర్విధపురుషార్థాలకూ మూలమవటంచేత పంచదశీ మహామంత్రము **"మూలమంత్రము"** అనబడుతున్నది. ఈ మూలమంత్రము మూడు కూటములుగా ఉన్నది. ఆ కూటత్రయమే పరమేశ్వరిస్వరూపము. ఇక్కడ 'మూల' అనే శబ్దము కామకలాక్షరాన్ని (శ్రీ) చెబుతున్నది. కూటత్రయము అనటంచేత మూడు విధాలయిన

అవయవాలు చెప్పబడుతున్నాయి. వివరంగా చెప్పాలంటే కామకళలో ఊర్ధ్వబిందువు, మధ్య బిందువు, నాదబిందువు. వీటినీ 'కూటత్రయము' అంటారు. కాబట్టే లలితా సహస్రంలో 88, 89 నామాలు **మూలమంత్రాత్మికా, మూలకూటత్రయ కళేబరా.**

## 88. మూలమంత్రాత్మికా

పంచదశీమహామంత్రం దేవికి ఆత్మస్వరూపం. శ్రీవిద్యాసంప్రదాయానికి పంచదశీ మహామంత్రం గాయత్రివంటిది. ఈ మంత్రోపాసనచేసిన వారికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. **మననాత్రాయత ఇతిమంత్రః,** మననము చేయుట వలన మననము చేయు వానిని రక్షించునది మంత్రము. సంసారబంధనాలను త్రెంచి ఆత్మసాక్షాత్కారము చెయ్యగలిగేదే మంత్రము. అటువంటి మంత్రస్వరూపిణి ఆ పరమేశ్వరి.

చతుర్విధపురుషార్థాలకు మూలకారణమవటం చేత పంచదశాక్షరీమంత్రము మూలమవుతున్నది. ఆ మంత్రమే ఆత్మస్వరూపంగా గలది ఆ దేవి. వేదమందలి మూలమంత్రము పరమేశ్వరి స్వరూపము.

## 89. మూలకూటత్రయకళేబరా

పైన చెప్పినట్లుగా మూలమంత్రము మూడుకూటములుగా ఉన్నది. ఆ కూటత్రయమే పరమేశ్వరి స్వరూపము. అదే దేవిస్థూలరూపము. ఇక్కడ మూల అనే శబ్దము కామకలాక్షరము (శ్రీ)ను చెప్పుచున్నది. కూటత్రయము అనటంచేత మూడువిధాలయిన అవయవాలు చెప్పబడుతున్నాయి. కామకళలో ఊర్ధ్వబిందువు, దాని క్రింద అడ్డుగా ఉన్న రెండుబిందువులు, దానికింద హార్దకళ, ఇంకా వివరంగా చెప్పాలి అంటే కామకళలో ఊర్ధ్వబిందువు, మధ్యబిందువు, నాదబిందువు అని మూడు కూటములున్నాయి. పంచదశీ మహామంత్రానికి అనేక అర్థాలు చెప్పబడ్డాయి వాటిలో

**అథాతః పూర్ణగాయత్ర్యాః ప్రతిపాద్యోర్థఆదిమః**

మొట్టమొదటగా పంచదశి మహామంత్రానికి గాయత్రి మంత్రార్థం చెప్పబడింది. ఆ తరువాత భావార్థము, సంప్రదాయార్థము ఈ రకంగా 15 అర్థాలు చెప్పబడ్డాయి. దీనిమీద ఇంకా వివరాలకు నా చే వ్రాయబడిన 'వరివస్యారహస్యము' చూడండి.



గాయత్రిమంత్రంలోని మూడుపాదాలను మూడుకూటములుగా భావించాలి. ఈ కూటత్రయమే పరమేశ్వరి శరీరము. మూలమంత్రంలోని వాగ్భవశక్తి కామరాజకూటాలే పరమేశ్వరి శరీరము. మంత్రానికి ఇవే బీజము, శక్తి, కీలకము.

పంచదశీ మహామంత్రానికి (సౌభాగ్యవిద్య) దక్షిణామూర్తి ఋషిః। పంక్తిఛందః। శ్రీసౌభాగ్యవిద్యేశ్వరీత్రిపురసుందరీ దేవతా। ఐం బీజం। సౌః శక్తిః। క్లీం కీలకం।

ఆధారచక్రంలో కుండలినీ శక్తి స్వయంభూ లింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని సర్పాకారంలో నిద్రావస్థలో ఉంటుంది. ఆ మూడువలయాలే మూడు కూటములు. మూల మంత్రభావం నుంచి దేవతయొక్క కూటత్రయాన్ని, స్థూల, సూక్ష్మ, కారణదేహ భావాన్ని వేరుచేసినట్లైతే మిగిలే దృక్పదార్థమే దేవతయొక్క నిజస్వరూపం. వేరుచేయబడిన స్థూల సూక్ష్మ కారణ దేహాలసముదాయమే కళేబరము.

దేవి మూలమంత్రం పంచదశి. శ్రీవిద్యకు మూలమంత్రం షోడశి. శ్రీ అనే బీజముతో కూడిన శ్రీవిద్య దేవికి సూక్ష్మరూపము. శ్రీ అనేది కామకలాబీజము. పదిహేనుచంద్రకళలు షోడశీకల నుంచి ఆవిర్భవించాయి. అందుకే దేవికి 15 కళలు అవయవాలు. కూటత్రయము శరీరము. స్థూలరూపము – ముఖము మొదలైన అవయవాలు. సూక్ష్మరూపము – మంత్రము. దుర్వాసుడు పంచదశీ మహామంత్రాన్ని వర్ణిస్తూ శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 14వ శ్లోకంలో

**ఇత్థం త్రీణ్యపి మూల వాగ్భవ మహాశ్రీకామరాజస్ఫుర**
**చ్ఛక్త్యాఖ్యాని చతుఃశ్రుతి ప్రకటితా న్యుత్కృష్ట కూటాని తే**
**భూత ర్తుశృతి సంఖ్య వర్ణవిదితా న్యారక్తకాంతే ! శివే !**
**యో జానాతి స ఏవ సర్వజగతాం సృష్టి స్థితి ధ్వంసకృత్ ॥**

అరుణకాంతులతో విరాజిల్లు ఓ దేవీ ! శుభస్వరూపా ! ఈ రకంగా వాగ్భవ కామరాజ శక్తికూటములుకలది, నాలుగువేదాలయందు ప్రతిపాదించబడినది, అయిన పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించేవారు సర్వజగత్కర్త అంటే పరమేశ్వరుడవుతాడు.

పంచదశీ మహామంత్రం సామాన్యమైనదికాదు. ఆ మంత్రాన్ని జపం చెయ్యాలంటే పూర్వజన్మకృతం ఉండాలి. అసలు పరమేశ్వరిని గురించి తలచాలన్నా, నమస్కరించాలన్నా పూర్వజన్మకృతము ఉండితీరాలి. ఇదే మాటను శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని మొదటిశ్లోకంలో

**ప్రణన్తుం స్తోతుం వా కథమకృతపుణ్యాఃప్రభవతి ?**

అంటారు. మంత్రము దేవి యొక్క సూక్ష్మరూపమే కదా ! మరి అటువంటి మంత్రోపాసన చెయ్యాలి అంటే ఎంత పుణ్యం ఉండాలి ? లలితాత్రిశతి ఫలశృతిలో

**యస్యనో పశ్చిమం జన్మ యదివా శంకరస్వయం**

**తేనైవలభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ।**

పంచదశీ మంత్రోపాసన చెయ్యాలి అంటే అతడికి మరుజన్మ లేకుండా ఉండాలి లేదా సాక్షాత్తూ అతడే పరమేశ్వరుడై ఉండాలి.

ఇది జ్ఞానప్రదమైనది. మోక్షహేతువు. అందుచేతనే

**ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదాభవేత్**

**కత్రయం హద్వయం చైవ శైవభాగో ప్రకీర్తితః**

**శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః**

పంచదశీ మహామంత్రంలోని కకారాలు మూడు, హకారాలు రెండు వెరసి ఐదు శివాత్మకాలు. హ్రీంకారములు మూడు ఉభయాత్మకాలు. అంటే శివశక్త్యాత్మకాలు. మిగిలిన ఏడు అక్షరాలు శక్త్యాత్మకాలు. ఈ విషయం తెలిసిన వాడికి శ్రీవిద్య త్వరగా సిద్ధిస్తుంది. శ్రీవిద్యోపాసన చాలా ఉత్తమమైనది. సాధకుడికి మంచి ఫలితాన్ని ఇస్తుంది. మనోవాంఛలను ఈడేరుస్తుంది.

**ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్**

**విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకమ్**

**సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్**

**సర్వాభీష్టప్రదం చైవ శ్రీవిద్యాపఠనం భవేత్ ॥**

లలితాత్రిశతి అంటే పంచదశీ మహామంత్రమే. కాని వేరుకాదు. ఈ మంత్రంలోని ఒక్కొక్క అక్షరానికి 20 నామాలను చెప్పటం జరిగింది. 15 × 20 = 300 నామాలు. అదే లలితాత్రిశతి.



దీనిని గనక జపించినట్లైతే ఇది ఆయుష్యకరము, పుష్టికరము, వశీకరణము, విద్యాప్రదము, కీర్తికరము, కవిత్వప్రదము, సంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యప్రదము, సర్వాభీష్టప్రదము

శ్రీవిద్యలో మొదటిది 'బాలామంత్రము' ఎవరీ బాలాత్రిపురసుందరి ? ఈమెను గురించి లలితాసహస్రంలోని 'భండాసురవధ' ఘట్టంలో **"భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితా"** అనే 74వ నామంలో చెప్పబడింది. భండాసురడితో యుద్ధం చేస్తున్నప్పుడు భండాసురుని కుమారులు ముప్పైమంది ఒక్కసారిగా దేవిని చుట్టుముట్టారు. అప్పుడు కేవలము సంకల్ప మాత్రం చేత ఉద్భవించి భండపుత్రులను సంహరించిన పరమేశ్వరిస్వరూపులు **బాలాత్రిపురసుందరి.**

**అరుణ కిరణజాలై రంచితా శావకాశా**

**విధృత జపటీకా పుస్తకాభీతి హస్తా ।**

**ఇతర వరకరాఢ్యా పుల్లకల్హార సంస్థా**

**నివసతుహృది బాలా నిత్యకల్యాణశీలా ॥**

అరుణారుణచ్ఛాయలతో ప్రకాశిస్తూ, పై రెండు చేతులలోను పుస్తకము, అక్షమాల, క్రింది రెండు చేతులతోను అభయవరద ముద్రలు ధరించి, పద్మాసనాసీన యైన ఆ దివ్యమంగళమూర్తి నా హృదయపీఠమందు నివశించుగాక. బాలామంత్రం అంటే బాలాత్రిపురసుందరీ ఉపాసనా మంత్రం. ఇందులో మూడుబీజాలు అనులోమ విలోమంగా ఉంటాయి. అప్పుడు మొత్తం ఆరుఅక్షరాలవుతాయన్న మాట. ఈ మూడు బీజాక్షరాలు 1) వాగ్భవ బీజము ఐం 2) కామరాజబీజము క్లీం, 3) శక్తి బీజము సౌః మానవుడికి ఐహికంలో కావలసిన అర్ధకామాలను సాధించిపెట్టేవి ఈ మూడు బీజాక్షరాలే. వీటినే అనులోమ విలోమంగా చెప్పటంవల్ల వాటి శక్తి కొన్నిరెట్లు పెరుగుతోంది. శ్రీవిద్యలో ఇది మొదటి మంత్రం. కాగా రెండవ దశలో చెప్పే మంత్రము పంచదశి. ఈ మంత్రము మూడు కూటములుగా ఉంటుంది. 1. వాగ్భవకూటమి 2. కామరాజ కూటమి 3. శక్తికూటమి.

పూర్వకాలంలో ఎంతోమంది మహానుభావులు ఈ పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించారు.

**మను శ్చంద్ర కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి రగ్ని సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివ స్తథా**
**క్రోధభట్టారకోదేవ్యా ద్వాదశాదో ఉపాసకాః ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్త్యుడు, అగ్నిదేవుడు, సూర్యుడు, ఇంద్రుడు, స్కందుడు (కుమారస్వామి), శివుడు, దుర్వాసుడు అనే పన్నెండుమంది ఈ మంత్రాన్ని జపించి తరించారు. **"మానసోల్లాసము"** అనే గ్రంథంలో

**విష్ణుః శివః సురజ్యేష్ఠో మను శ్చంద్రో ధనాధిపః**
**లోపాముద్రా తథాగస్త్యః స్కందః కుసుమసాయకః**
**సురాధీశో రోహిణీయో దత్తాత్రేయో మహామునిః**
**దుర్వాసా ఇతి విఖ్యాతా ఏతే ముఖ్య ఉపాసకాః ॥**

విష్ణువు, శివుడు, బ్రహ్మ, మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, అగస్త్యుడు, కుమారస్వామి, మన్మథుడు, ఇంద్రుడు, బలరాముడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు వీరందరు ప్రఖ్యాతి గడించిన దేవీఉపాసకులు అని చెప్పారు. **"జ్ఞానార్ణవము"** అనే తంత్రంలో

**మనుశ్చంద్ర కుబేరశ్చ మన్మథ స్తదనంతరమ్**
**లోపాముద్రా తథాగస్త్యః స్కందో విష్ణు స్తదా శివః**
**దత్తాత్రేయో మునిః శక్రో దుర్వాసాశ్చ త్రయోదశ**
**ఉపాసతే మహావిద్యా ద్వాదశోక్తా స్తవానఘే ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, మన్మథుడు, లోపాముద్ర, అగస్త్యుడు, కుమారస్వామి, విష్ణువు, శివుడు, దత్తాత్రేయుడు, ఇంద్రుడు, దుర్వాసుడు మొదలైన మహానుభావులు పంచదశీమహామంత్రాన్ని ఉపాసించి తరించారు.

మంత్రాన్ని దర్శించినవాడు ద్రష్ట. సృష్టించినవాడు స్రష్ట. పంచదశీ మహామంత్రాన్ని దర్శించి ఈలోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదము. కాగా దక్షిణామూర్తి ఋషి అని కొందరంటారు. కాని



వాడుకలోకి వచ్చేసరికి అనేక సంప్రదాయాలున్నాయి. వీరిలో కొంతమంది, మన్మథుడు, దక్షిణామూర్తి కాకుండా ఇతరులను ఋషులుగా చెబుతున్నారు. అది వారి సంప్రదాయం. ఇన్ని సంప్రదాయాలున్నప్పుడు మనం ఏ సంప్రదాయాన్ని అంగీకరించాలి ? అన్నప్పుడు అన్ని సంప్రదాయాలను గౌరవించటం మన విధి అని మరచిపోకూడదు. ఇక పంచదశీ మహామంత్రం ఏ రకంగా వచ్చిందో చూద్దాం.

ప్రళయం సంభవించినప్పుడు సృష్టిఅంతా పరమేశ్వరునిలో లీనమై పోయింది. ఇది ఎలా జరిగింది ? అంటే ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం అయిన జీవరాశి అంతా ముక్తినిపొందగా, కర్మక్షయంకాని జీవరాశి ఆ కర్మను తమతో మూటకట్టుకున్నదై, తనకర్మతో సహా మాయలో లీనమైపోయింది. ఆ తరువాత భూమి జలమునందు, జలముఅగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము మాయయందు లీనమవగా, వీటన్నింటినీ తనలో లీనం చేసుకున్న మాయ, పరమేశ్వరునిలో లీనమైపోయింది. ఈ విధంగా సృష్టి అంతా పరమేశ్వరునిలో లీనమవగా, ఇప్పుడు వికారాలు లేనిది, సత్యజ్ఞానానంద మయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగాఉన్నది, ఏకముగాఉన్నది, రెండవది లేనిది పరబ్రహ్మస్వరూపము ఒక్కటేఉన్నది. నిరాకారమైన ఆ పరబ్రహ్మ స్వరూపంలో ఎడారులందు ఎండమావిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ, తెలుపు, ఎరుపు, నలుపు గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మయే సాక్షిచైతన్యము.

ఈ పరమేశ్వరతత్త్వానికి రూపంలేదు. గుణంలేదు, లింగభేదం అసలే లేదు. ఇది తేజోమయమైన కాంతిపుంజము. బ్రహ్మవాదులు దీన్నే 'పరమేశ్వరుడు' అంటారు. అది శివశక్తుల ఏకీకృతరూపము.

ఈ రకంగా సృష్టినంతటినీ తనలోనిక్షిప్తం చేసుకున్న ఆ పరమేశ్వరి ఇప్పుడు సృష్టిచెయ్యాలి అని సంకల్పించింది. సృష్టి ఎందుకుచెయ్యాలి ? ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాకుండా తనలోలీనమైపోయిన జీవకోటికి కర్మక్షయంచేసి, దానికి ముక్తికలిగించాలనే ఉద్దేశ్యంతో సృష్టిచెయ్యాలని సంకల్పించింది పరమేశ్వరి. ఇప్పుడు సృష్టి ప్రారంభమైంది. ముందుగా ఆ పరమేశ్వరి నుంచి సత్త్వగుణ ప్రధానమైన

అవ్యక్తం వచ్చింది. అదేమాయ. ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. మాయవల్లనే సృష్టిస్థితిలయాలు అన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు అవ్యక్తము నుంచి రజోగుణప్రధానమైన మహత్తత్త్వము పుట్టింది. అదే హిరణ్యగర్భుడు. మహత్తత్త్వము నుంచి తమోగుణప్రధానమైన అహంకారము పుట్టింది. అదే దేవి విరాడ్రూపము. ఈ రకంగా పరమేశ్వరి నుంచి అవ్యక్తము (మాయ) మహత్తత్త్వము (హిరణ్యగర్భుడు) అహంకారము (విరాడ్రూపము) ఆవిర్భవించినాయి.

ఈ అహంకారము నుంచే నామరూపాత్మకమైనజగత్తు ఆవిర్భవించింది. ముందుగా రూపాత్మకజగత్తు. అహంకారం నుంచి పంచభూతాలసూక్ష్మ రూపాలయిన తన్మాత్రలు ఆవిర్భవించాయి. అవే శబ్ద స్పర్శ రూప రసగంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. పంచభూతాలలో ముందుగాపుట్టింది ఆకాశము. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి, భూమి నుంచి ఓషధులు, ఓషధుల నుంచి వనస్పతులు, వనస్పతుల నుంచి అన్నము వచ్చింది. ఈ రకంగా రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఇక నామాత్మకమైన జగత్తు. అవ్యక్తము నుంచి ముందుగా ఓంకారము పుట్టింది. ఓంకారము నుంచి అకార ఉకార మకారాలు వచ్చినాయి. వాటినుంచి అక్షరసమామ్నాయము వచ్చింది. అక్షరాల నుంచి పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సంగీతము, సాహిత్యము వచ్చాయి. ఈ రకంగా పరమేశ్వరి నుంచి నామరూపాత్మకమైనజగత్తు ఏర్పడింది.

ఇప్పుడు పంచభూతాల పంచీకరణ జరిగింది. పంచభూతాలలో ముందుగా ఆకాశం పుట్టింది. ఆకాశంలో దానియొక్కలక్షణం శబ్దముమాత్రమే ఉన్నది. ఆకాశం నుంచి వాయువు వచ్చింది. వాయువు లక్షణం స్పర్శ. అందుచేత వాయువులో ఆకాశలక్షణమైన శబ్దము, వాయులక్షణమైన స్పర్శ ఉన్నాయి. వాయువు నుంచి అగ్ని వచ్చింది. అగ్నిలో ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్ని లక్షణమైనరూపము ఉన్నాయి. అగ్ని నుంచి జలము వచ్చింది. జలమునందు ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైనరసము ఉన్నాయి. జలము నుంచి భూమి వచ్చింది. భూమియందు పంచభూతాల యొక్క లక్షణాలన్నీ అంటే ఆకాశ లక్షణమైనశబ్దము, వాయులక్షణమైన



స్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైనరసము, భూలక్షణమైనగంధము ఉన్నాయి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఆకాశమునందు | – | శబ్దము |
| వాయువునందు | – | శబ్దము, స్పర్శ |
| అగ్నియందు | – | శబ్దము, స్పర్శ, రూపము |
| జలమునందు | – | శబ్దము, స్పర్శ, రూపము, రసము |

భూమియందు – శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము ఉన్నాయి. ఇదే పంచీకరణ. ఈ పంచీకరణలో మొత్తం పదిహేను భాగాలున్నాయి. **ఈ రకంగా పంచభూతాల పంచీకరణతో వచ్చిన పదిహేను భాగాలే, పంచదశి మహామంత్రంలోని పదిహేను బీజాక్షరాలు.** పంచదశి మహామంత్రము అంటే పంచభూతాలు అని అర్థం. ఈ సృష్టి అని అర్థం ఈ జగత్తు అని అర్థం. సాక్షాత్తూ చరాచరజగత్తే పంచదశీమహామంత్రంగా ఆవిర్భవించింది. సంస్కృతభాషకు గల అక్షరాలు యాభై అని, మంత్రశాస్త్రానికి అక్షరాలు యాభైఒకటి అని గతంలో చెప్పుకున్నాం. **మాతృకా హృదయము** అనే గ్రంథంలో

**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః**
**సమస్త వ్యస్తరూపేణ షట్త్రింశత్ తత్త్వ విగ్రహా ॥**
**అకారాది విసర్గాంతాః స్వరాఃషోడశ శక్తయః**
**నిత్యాషోడశకాత్మనః పరస్పర మమీయు తాః ॥**
**శివశక్తి మయావర్ణా శబ్దార్థ ప్రతిపాదకాః**
**శివః స్వర పరాధీనో నస్వతంత్రః పదాప్ససౌః ॥**
**స్వరాః స్వతంత్రా జాయంతే నశివస్తు కథాచన**

అని చెప్పారు. వీటిలో అ నుంచి విసర్గ అంటే అః వరకు అచ్చులనీ, క నుంచి క్ష వరకు హల్లులని అంటారు. అచ్చులు శక్తి స్వరూపాలు హల్లులు శివస్వరూపాలు. అచ్చు స్వతంత్రత గలవి. హల్లులు స్వతంత్రత లేనివి. అంటే హల్లులు అచ్చులతో కలిస్తే ఒకరూపాన్ని సంతరించుకుంటాయి. హల్లులను విడిగా పలకలేము. అవి అచ్చులతో కలిస్తేనే పలకబడతాయి.

వీరు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, బంగారు లేక వెండి రేకుమీద వ్రాసి దాన్ని ఆరాధిస్తారు. దీనిని కౌళపూజ అంటారు.

షట్చక్రాల్లోని ఆధార, స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వాటియందు కౌళులకే అధికారం వుంది. భైరవ యామళంలో

**చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంభిః ।**
**నవ చక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ॥**
**త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా ।**
**చతుర్దశారం చైతావి శక్తిచక్రాణి పంచ చ ॥**
**బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్ ।**
**చతురశ్రంచ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్ ॥**

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలతో ఉన్న చక్రాన్నే శ్రీచక్రం అంటారు. దీనిలో త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము అనే ఐదు శక్తిచక్రాలు. బిందువు, అష్టదళము షోడశదళము, భూపురము అనే నాలుగు శివచక్రాలు ఉన్నాయి.

ఆధారచక్రమే త్రికోణము. దానిలో బిందు ఉన్నది అని ప్రసిద్ధి. కౌళమతానుసారము త్రికోణమే బిందు స్థానం. ఆ బిందువే త్రికోణమందు ఆరాధింప దగినది. అందుకే కౌళులు త్రికోణాన్ని పూజిస్తారు. ఈ త్రికోణము రెండు రకాలుగా ఉంటుంది.

1. శ్రీచక్రంలో మధ్య ఉన్న త్రికోణము
2. సుందరాంగి అయిన స్త్రీయొక్క ప్రత్యక్షయోని.

కౌళాచారుల్ని రెండు రకాలుగా విభజించవచ్చు.

1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, బంగారము లేదా వెండి రేకుమీద వ్రాసి దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు. ఉత్తరకౌళులు స్త్రీయొక్క ప్రత్యక్ష యోనిని పూజిస్తారు. వీరికి శివుడనేవాడు ప్రత్యేకంగా లేడు.



ఈ రెండు రకాల పూజలూ బాహ్యపూజలే. అందుచేత వారికి ఆధారచక్రమే పూజనీయమవుతుంది. అందులో ఉండే కుండలినీ శక్తినే కౌళిని అంటారు. త్రికోణపూజలో కౌళినియే ఉపాశ్య.

ఆధారచక్రంలో కుండలినీశక్తి సర్పాకారం ధరించి తోకను నోటితో కరచి పట్టుకున్నట్లుగా ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కుండలినీ శక్తి పూజింపతగినదే. అందుకే ఆ పూజను తామిశ్రమకము అంటారు. ఆధార స్వాధిష్టానాలు అంధకారబంధురాలు. వాటిమీద కౌళాచారులకు మాత్రమే అధికారం ఉంది. కుండలినీ ప్రబోధం ఎప్పుడు కలుగుతుందో, ఆ క్షణంలోనే కౌళులకుముక్తి కలుగుతుంది. అందుకనే కౌళులను **"క్షణముక్తులు"** అంటారు. కౌళులకు త్రికోణంలో భైరవీభైరవులు పూజనీయులు.

**జపాకుసుమ సంకాశౌ మదఘూర్ణితలోచనౌ**
**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

సాధకులు వారితో ఐక్యము పొందటం అనేది ముఖ్యం. అందుకనే బిందువును పూజించేటప్పుడు స్త్రీ పురుషులు భైరవాకారమైన దిగంబరత్వాన్ని ఆశ్రయించి, అంటే వారు దిగంబరులై పూజ చేస్తారు. వామాచార ప్రవృత్తి ననుసరించి మధు, మత్స్య, మాంసాలతో సమారాధన చేస్తారు.

ఉత్తరకౌళులు స్త్రీయోనిలోని మన్మథఛత్రాన్ని బిందువుగా భావించి పూజిస్తారు. అందుకే అది అవైదికము, నీతి బాహ్యము అని చెప్పబడింది.

కౌళులు పరమేశ్వరుణ్ణి నవాత్మకుడు లేదా నవవ్యూహాత్మకుడు అంటారు. ఈ నవవ్యూహాలను **కామకలావిద్య**లో ఈ విధంగా చెప్పబడింది.

**కాలవ్యూహః కులవ్యూహో నామవ్యూహ స్తథైవచ**
**జ్ఞానవ్యూహ స్తథా చిత్తవ్యూహ స్స్యాత్తదనంతరమ్ ॥**
**నాదవ్యూహ స్తథా బిందు వ్యూహస్స్యాత్తదనంతరమ్**
**కలావ్యూహస్తథా జీవవ్యూహస్స్యాదితితే నవ ॥**

**1. కాలవ్యూహము :** నిమిషము మొదలు కల్పాంతము వరకు ఉన్న కాలము యొక్క సముదాయము.

**2. కులవ్యూహము :** ఎరుపు, తెలుపు, నీలము మొదలైన రంగులను గురించి తెలిపేది.

**3. నామవ్యూహము :** ప్రపంచంలోని ప్రాణులయొక్క పేర్లను తెలిపేది.

**4. జ్ఞానవ్యూహము :** ఇంద్రియాల ద్వారా ప్రపంచాన్ని గురించి తెలుసుకొనే జ్ఞానము.

**5. చిత్తవ్యూహము :** అహంకారము, చిత్తము, బుద్ధి, మహత్తత్త్వము, మనస్సు అను అహంకార పంచకము గురించి తెలిపేది.

**6. నాదవ్యూహము :** రాగము, ఇచ్ఛ, కృతి, ప్రయత్నము, మాయశుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పరాపశ్యంతి, మధ్యమ, వైఖరిలను గురించి తెలిపేది.

**7. బిందువ్యూహము :** ఆధారాది షట్చక్రాల సంఘము.

**8. కళావ్యూహము :** యాభై కళలై వర్గ స్వరూపములైన అక్షరముల గురించి తెలిపేది.

**9. జీవవ్యూహము :** భోక్తలగు జీవుల సమూహము.

**నవవ్యూహాత్మకోదేవః పరానంద పరాత్మకః**
**నవాత్మా భైరవోదేవో భుక్తి ముక్తి ప్రదాయకః ।**
**పరానంద పరాశక్తిః చిద్రూపాఽఽనందభైరవీ**
**తయోర్యదా సామరస్యం జగదుత్పద్యతే తదా ॥**

పరానందుడు, పరాత్మకుడు అను భైరవుడు నవవ్యూహాత్మకుడు. ఆయనే భక్తి, ముక్తి ప్రదాత. పరానందమైన పరాశక్తి చిద్రూప అయిన ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీ భైరవులకు సామరస్యము ఎప్పుడు కలుగుతుందో అప్పుడు జగదుత్పత్తి జరుగుతుంది.

**భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।**
**శక్తిః కుండలినీ నామబిసతంతు నిభాఽఽశుభా ॥**



**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**
**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥**
**పద్మాసన గత స్వస్థో గుద మాకుంచ్యసాధకః ।**
**వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥**
**వాయ్వాఘాత వశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**
**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితోఽహిరాట్ ॥**
**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్యతః ।**
**బ్రహ్మగ్రంథించ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥**
**సహస్రకమలే శక్తిః శివేన సహమోదతే ।**
**సాచావస్థా పరా జ్ఞేయా సై వనిర్వృతి కారణమ్ ॥**

సర్పాకారములతో భగవతి ఆధారచక్రంలో కుండిలినీ శక్తియై మెరుపు తీగవలె ప్రకాశిస్తూ ఉంటుంది. సాధకుడు మడమను గుదస్థానంలో సంధించి శ్వాసను పైకి వదులుతూ ప్రాణాయామం చేయాలి. అప్పుడు స్వాధిష్ఠానంలో అగ్నిప్రజర్విల్లి కుండలినీశక్తి మేల్కొంటుంది. అంతట ఆ శక్తి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులను భేదించుకుని సహస్రారం చేరి శివునితో సంతోషం పొందుతుంది. ఆ స్థితిలో ఉన్న దేవియే పరాశక్తి. నిత్య సుఖకారిణే అంటే కుండలినీ ప్రబోధం కలిగితేనే దేవి సాక్షాత్కారం జరుగుతుంది.

కౌళులు నాలుగు దళాలుగల ఆధారచక్రాన్ని, ఆరు దళాలు కల స్వాధిష్ఠానంతో అంతర్భూతం చేసి పూజిస్తారు. ఈ రకంగా ఆధారస్వాధిష్ఠానాలను అనుసంధానం చెయ్యటం వలన వారికి షట్చక్ర అనుసంధానం చేసిన ఫలం కలుగుతుంది.

**పాశాంకుశౌ తదీయౌతు రాగద్వేషాత్మకౌ స్మృతౌ**
**శబ్ద స్పర్శాదయో బాణాః మనస్తస్యాభవద్ధనుః ।**
**కరణేంద్రియచక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీమ్**
**విశ్వాహంకార పుష్పేణ పూజయే త్సర్వసిద్ధిభాక్ ॥**

సాధకుడు తన రాగద్వేషాలను దేవి పాశాంకుశాలుగా, తన మనస్సును దేవి చేతిలోని ధనుస్సుగా పంచతన్మాత్రలు దేవి బాణాలుగా భావించి అహంకారమను పుష్పముచే దేవిని పూజించినట్లైతే అతడికి సర్వసిద్ధులు కలుగుతాయి.

**కుండలినీ శక్తి :**

**ధ్యాయేత్ కుండలినీం దేవీం స్వయంభూలింగ వేష్టినీమ్**
**శ్యామాం సూక్ష్మాం సృష్టి రూపాం సృష్టి స్థితి లయాత్మికామ్**
**విశ్వాతీతామ్ జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వ వాహినీమ్"**
**"ధ్యాయేత్ కుండలినీం దేవీ మిష్టదేవస్వరూపిణీమ్**
**సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్**
**నవయౌవన సంపన్నాం సర్వాభరణ భూషితామ్**
**పూర్ణచంద్రప్రభాం రక్తాం సదా చంచలలోచనామ్ ॥**

కంకాళ మాలినీ తంత్రంలో కుండలినీ వర్ణన

**కోటిచంద్ర ప్రతీకాశాం పరబ్రహ్మ స్వరూపిణీమ్**
**చతుర్భుజాం త్రిణేత్రాం చ వరదాభయకరాంతథా ।**
**తథా పుస్తకవీణాంచధారిణీం సింహవాహినీమ్**
**గచ్ఛంతీం స్వాసనాం భీమాం నానారూప ధరాత్మికామ్ ॥**

స్వయంభూలింగము పైన చిత్కళా శక్తి ఉన్నది. ఆమెయే పరమేశ్వరి. కలారూపిణి. సృష్టికార్యచతుర. సూక్ష్మ నిత్యానంద పీయూషధారాధర. ఆమె తేజస్సు చేతనే ఈ బ్రహ్మాండము వెలుగుచున్నది. రుద్రయామళంలో కుండలినీ స్తవము ఈ విధంగా ఉంది.

**జన్మోద్ధార విరక్షిణీహ తరుణీ వేదాది బీజాదిమా**
**నిత్యం చేతసి భావ్యతే భువికదా సద్వాక్య సంచారిణీ ।**
**మాంపాతు ప్రియదాస భావకపదం సంఘాతయే శ్రీధరే !**
**ధాత్రి!త్వం స్వయ మాదిదేవ వనితా దీనాతిదీనం పశుమ్ ॥**



ఓ పరాత్పరీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సర్వకాల సర్వావస్థల లోను ఉపనిషద్ వాక్యముల యందు సంచరిస్తుంటావు. ఓంకార స్వరూపిణివి. నిత్యయౌవనవు. మానవుల జన్మలనుద్ధరించటానికి సదా మెలుకువతో ఉంటావు. అట్టి నిన్ను ఎల్లప్పుడు నేను ధ్యానం చేస్తుంటాను.

**రక్తాభామృతచంద్రికా లిపిమయీ సర్పాకృతి ర్నిద్రితా**
**కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయా కుమార్గా శ్రియా ।**
**యద్యేవం భజతి ప్రభాత సమయే మధ్యాహ్నకాలే థవా**
**నిత్యం యఃకులకుండలీ జప పదాంభోజం ససిద్ధోభవేత్ ॥**

తల్లీ నీవు రక్తవర్ణముతో ప్రకాశిస్తూ సర్పాకృతిలో నిద్రిస్తున్నావు. నీవు జాగ్రదావస్థలోకి వచ్చినప్పుడు నీ కరుణా దృక్కులు నామీద ప్రసరింపచేయుము.

**సిద్ధార్థీ నిజదోషవిత్ స్థలగతి ర్వ్యాయీయతే విద్యయా**
**కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయా కుమార్గా శ్రియా ।**
**యద్యేవం భజతి ప్రభాత సమయే మధ్యాహ్నకాలే థవా**
**నిత్యం యఃకులకుండలీ జప పదాంభోజం ససిద్ధోబవేత్ ॥**

దేవీ ! కుండలినీ శక్తిగా ఉన్న నీ పాదాలను త్రిసంధ్యల యందు ఎవరైతే సేవిస్తారో వారు సిద్ధులౌతారు.

**వాయ్వాకాశ చతుర్దతే ఉ తి విమలే వాంఛాపలాన్యాలకే**
**నిత్యంసంప్రతి నిత్యదేహ ఘటితా సాంకేతితా భావితా ।**
**విద్యాకుండలమానినీ స్వజననీ మాయా క్రియా భావ్యతే**
**మైసైః సిద్ధకులోద్భవైః ప్రణతిభిః సత్‌స్తోత్రకైః శంభుభిః ॥**

నీవు విద్యాస్వరూపిణివి మాయా స్వరూపిణివి. క్రియాస్వరూపిణివి. జగన్మాతవు. పంచభూతాలతో కూడిన ఈ బ్రహ్మాండము నీ శరీరంగా సిద్ధులు భావిస్తుంటారు.

**వాతాశంక విమోహినీతి బలవచ్ఛాయాపటోద్గామినీ**
**సంసారాది మహాసుఖప్రహననే ! తత్రస్థితా యోగినీ ।**

**సర్వగ్రంధి విభేదినీ స్వభుజగా సూక్ష్మాతిసూక్ష్మాపరా**

**బ్రహ్మజ్ఞాన వినోదినీ కులకుటీ రాఘాతనీ భావ్యతే ॥**

అమ్మా ! నీవు భుజంగాకారముతో ఉండి, గ్రంధిభేదనము చేసి సాధకుడు సుఖమని భావించే సంసార బంధనాలను త్రెంచివేసి బ్రహ్మజ్ఞానమందించే పరాశక్తివి.

**వందే శ్రీకులకుండలీం త్రివలిభిః సాంగైః స్వయంభూప్రియాం**

**ప్రావేష్ట్యాంబర చిత్తమధ్య చపలా బాలాబలానిష్కలా ।**

**యాదేవీ పరిమాతి వేదవదనా సంభావనీ తాపినీ**

**ఇష్టానాంశిరసి స్వయంభూ వనితా సంభావయామి క్రియామ్ ॥**

వేదస్వరూపమైన ఓ దేవీ ! ఆకాశమనే మనస్సున మెరుపులా ప్రకాశిస్తుంటావు. నీ ఉపాసకులకు, సాధకులకు క్రియాశక్తివి.

**వాణి కోటి మృదంగ నాద మదనా నిశ్రేణి కోటిధ్వనిః**

**ప్రాణేశీ ప్రియతామమూల కమనోల్లాసైక పూర్ణాననా ।**

**ఆషాఢోద్భవ మేఘరాజి జనిత ధ్వాంతాన నా స్థాయినీ**

**మాతాసా పరిపాతు సూక్ష్మపరగా మాం యోగినాం శంకరీ ॥**

నీ ముఖము నుండి అనేకమైన వాగ్విశేషములు, అనంతమైన వాద్యములతో సమానమైన ధ్వని విశేషములు వినవస్తుండగా, సూక్ష్మమార్గంలో సంచరిస్తూ యోగీశ్వరులకు కూడా సుఖాన్నిచ్చే ఓ తల్లీ ! మమ్ము కాపాడుదువుగాక.

**త్వామాశ్రిత నరా ప్రజంతి సహసా వైకుంఠ కైలాసయో**

**రానందైకవిలాసినీం శశిశతానాందాననాం కారణామ్ ।**

**మాతః శ్రీకులకుండలీ ప్రియకవే ! కాలీ కలోద్దీపనే !**

**తత్ స్థానం ప్రణమామి భద్రవనితే ! మాముద్ధరత్వం పథే ॥**

నిన్ను ఆశ్రయించి కైలాస, వైకుంఠములందు ఆనందముగా ఉన్న నిన్ను, నీ ఉపాసకులు చేరగలుగుతున్నారు. వేలకొలది చంద్రులతో సమానమైన కాంతులతో ప్రకాశించే ముఖము గల ఓ మంగళ స్వరూపిణీ, జగత్కారణభూతురాలవైన నీకు నమస్కరించుచున్నాను. నన్ను ఉద్ధరింపుము.



ఆధారచక్రానికి కొద్దిగా పైభాగాన స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని సర్పాకారంలో కుండలినీ శక్తి అధోముఖంగా నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు యమనియమాదుల వల్ల పరిశుద్ధుడై గురువు దగ్గర ఉపదేశం పొంది, కుండలినీ ప్రబోధము ఏ విధంగా చెయ్యాలో తెలుసుకోవాలి. కుండలినీ శక్తిని గురించి దాదాపుగా అన్ని తంత్రాలలోనూ చెప్పటం జరిగింది. వామకేశ్వర తంత్రంలో:

**భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।**

**శక్తిః కుండలినీ నామబిసతంతు నిభాఽఽశుభా ॥**

**మూలకందం ఫణాగ్రేణ దృష్ట్వా కమలకందవత్ ।**

**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥**

**పద్మాసన గత స్వస్థో గుద మాకుంచ్యసాధకః ।**

**వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥**

**వాయ్వాఘాత వశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**

**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితోఽహిరాట్ ॥**

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్యతః ।**

**బ్రహ్మగ్రంథించ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥**

**సహస్రకమలే శక్తిః శివేన సహమోదతే ।**

**సాచావస్థా పరా జ్ఞేయా సై వనిర్వృతి కారణమ్ ॥**

తంత్రసారంలో కూడా ఈ విషయాన్ని వివరించటం జరిగింది.

**కుండల్యేవ భవే చ్ఛక్తి స్తాంతు సంచాలయే ద్బుధః ।**

**స్వస్థానా దాభ్రువోర్మధ్యం శక్తి చాలన ముచ్యతే ॥**

**మూలాధారాది షట్చక్రం శక్తిస్థాన ముదీరితం ।**

**కంఠాదుపరి మూర్ధాంతం శాంభవ స్థాన ముచ్యతే ॥**

**మూలాధారే ధ్వనిం శ్రుత్వా ప్రబుద్ధా శక్తి కుండలీ ।**

**జ్వల త్పావకసంకాశా సూక్ష్మతేజ స్స్వరూపిణీ ॥**

**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా ।**
**సాచ విద్యుల్లతాకారా బ్రహ్మద్వారం మనోమయమ్ ॥**
**ముఖేనాచ్ఛాద్యతద్ద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ ।**
**సార్ధత్రివలయాకారా గ్రంధిత్రయ విభేదినీ ॥**
**వృథ్వ్యాప్య చక్రద్వితయం రుద్రగ్రంధి పదోదితం ।**
**వహ్ని సూర్యమయం చక్రద్వయం తేజోమయం మహత్ ॥**
**విష్ణుగ్రంధి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం ।**
**వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్ ॥**
**బ్రహ్మగ్రంధి పదేనోక్త మంగళాయతనం మహత్ ॥**

కుండలినీశక్తి ఆధారచక్రంలో, నోటితో తోకను పట్టుకున్న సర్పాకారంలో నిద్రిస్తూ ఉంటుంది. చంద్రకిరణాల వల్ల స్రవించే అమృతపుధారలే దానికి ఆహారం. నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని లేపగలిగితే భగవత్సాక్షాత్కారమౌతుంది. సాధకుడు వజ్రాసనంలో కూచుని, చేతులను తొడలమీద ఉంచుకుని ఖేచరీ ముద్రతో ఏకాగ్రత సాధించి కాలి మడమతో గుదస్థానాన్ని తన్ని పట్టి, గాలి పూరించి కుంభించాలి. ఆ తరువాత గుదస్థానము కూడా కుంభించి అపాన వాయువును స్థంభింపచెయ్యాలి. అప్పుడు వాయువును పైకి లాగాలి. ఆ విధంగా లాగేటప్పుడు మూలాధార కర్ణికలో ఉన్న కామవాయువును వామావర్తముగా త్రిప్పాలి. అలా చెయ్యటంవల్ల కామాగ్ని ప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది. అప్పుడు కూర్చ బీజముతో కుండలినీ శక్తిని ఊర్ధ్వదిశగా నడిపించాలి.

సాధకుడు కాలిమడమతో గుదస్థానాన్ని తన్ని పట్టి వాయువును కుంభించినప్పుడు వాయువు ఊర్ధ్వముఖంగా బయలుదేరి చంద్ర సూర్యుల గమనాన్ని అవుతుంది. చంద్రుని గమనము ఎప్పుడైతే ఆగిపోయిందో, అప్పుడు అమృతం స్రవించదు. అమృతధారలు లేకపోవటం చేత నిరాహార అయిన కుండలిని మేల్కొని సుషుమ్నానాడి ద్వారా ఊర్ధ్వముఖంగా బయలుదేరుతుంది.



ఆ రకంగా బయలుదేరిన కుండలినీ శక్తి షట్చక్రాలను భేదించుకుని, గ్రంధిత్రయాన్ని దాటి, పంచబ్రహ్మలను అధిగమించి సహస్రారం చేరి, సహస్రదళ కమలాన్ని నోటితో కరచి పట్టుకుంటుంది. అప్పుడు చంద్రమండలం నుంచి అమృతపుధారలు స్రవించి శరీరంలోని డెబ్బైరెండువేల నాడీమండలాన్ని తడుపుతాయి.

మూలాధారము అంధకారబంధురము స్వాధిష్ఠానము, మణిపూరము మిశ్రమ లోకములు అనాహతము జ్యోతిర్లోకము విశుద్ధి చంద్రలోకము ఆజ్ఞాచక్రము సుధాలోకము సహస్రారమే చంద్రమండలము.

వెన్నుపూసకు 'మేరుదండము' అని పేరున్నది. దాని మధ్యలో సుషుమ్నా నాడి త్రినాడీ స్వరూపంగా ఉంటుంది. మేరుదండానికి ఎడమవైపున ఇడ, కుడివైపున పింగళనాడులున్నాయి. సుషుమ్న మధ్యలో వజ్ర అనునాడి ఉన్నది. ఇది శిరస్సు వరకు వ్యాపించి ఉంటుంది. వజ్రము మధ్యన చిత్రిణి అనే నాడి ఉన్నది. దాన్ని ఆధారంగా చేసుకుని షట్కమలాలు ప్రకాశిస్తున్నాయి. చిత్రిణీ మధ్యలో కంఠమునుండి పరమశివ పర్యంతము బ్రహ్మనాడి వ్యాపించి ఉన్నది. ఇది శుద్ధ జ్ఞాన స్వరూపిణి.

గౌడపాదులవారు తమ**సుభగోదయస్తుతి**లో కుండలినీశక్తికి మూడు దశలున్నాయన్నారు.

**కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషి దపరా**
**కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ ।**
**తతః పాతివ్రత్యం భుజతి దహరాకాశ కమలే**
**సుఖాసీనా యోషా భవసి భవసీత్కార రసికా ॥**

అవి వరుసగా 1. నిద్రావస్థ 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ వీటినే 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ అంటారు. మొదటి దశలో కుండలిని నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ఆ శక్తిని మేల్కొల్పినప్పుడు నిరాహార అయిన కుండలినీ మంద్రస్వరంతో పూత్కారం చేస్తూ ఊర్ధ్వముఖంగా బయలుదేరి గ్రంధిత్రయాన్ని భేదిస్తుంది. ఇది ప్రయాణావస్థ బ్రహ్మగ్రంధిని దాటి సహస్రారం చేరి అక్కడ ప్రౌఢయై, పతి అయిన పరమశివునితో విహరిస్తూ ఉంటుంది. ఇది సుఖావస్థ. మూడవది పతిప్రవతావస్థ.

కుండలిని సహస్రారం చేరిన తరువాత అమృతాస్వాదన చెయ్యటానికి స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని సహాయపడుతుంది. వాయువుచే అగ్నిని జ్వలింపచేసి, ఆ అగ్ని ద్వారా చంద్రమండలం నుండి అమృతాన్ని స్రవింపచేస్తుంది.

అక్కడ ఇరవై ఆరవ తత్త్వమైన పరాశక్తి, శివుని తనలో కలుపుకుని సుఖాశీనురాలవుతున్నది. అని గౌడపాదులవారన్నారు. భైరవయామళము, బహురూపాష్టకాలలో

**తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ**
**శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ।**
**తదుద్భూతామృతన్యంది పరమానంద నందితా**
**కులయోషిత్కులం త్యక్త్వా వరం వర్షణ మేత్యసౌ ॥**

కుండలినీ శక్తి షట్చక్రభేదనం చేసి సహస్రారమందలి చంద్రమండలం నుంచి అమృతాన్ని స్రవింపచేసి శరీరంలోని డెబ్బైరెండు వేల నాడీమండలాన్ని తడుపుతుంది. ఆ తరువాత మళ్ళీ స్వాధిష్ఠానానికి వచ్చి నిద్రిస్తుంది.

కౌళాచారాన్ని లలితా సహస్రంలో 90 నుంచి 95 వరకు గల నామాలలో వివరించారు.

## ౯౦. కులామృతైకరసికా

ఇక ఈ నామం దగ్గర నుంచీ కుండలినీ శక్తిని వివరిస్తున్నారు. కులము అంటే వంశము ఇది రెండురకాలు. 1. పైతృకవంశము 2. విద్యావంశము. పరమేశ్వరి అమృత స్వరూపిణి. ఆమె అమృతాన్నే ఆస్వాదిస్తుంది. ఉపాసకుడు తాను అమృతతుల్యుడను అనే భావంతో తాను సంపాదించిన యాగద్రవ్యాలు కూడా అమృతసమానమే అని భావించి జపహోమాదులు నిర్వహించాలి. ఈ రకంగా అమృతము నందు ఆసక్తికలదిదేవి. ఆ అమృతము కులము అంటే సహస్రారము నుంచి ఉద్భవించింది. కులామృతైకరసికా అని పిలువబడుతోంది. అంటే మూలాధారంలోని నిద్రావస్థలో ఉన్న ఆ కుండలినీ శక్తి సహస్రారం చేరుతుంది. అప్పుడు అక్కడి అమృతంతో సాధకుని శరీరంలోని నాడీమండలం అంతా పూర్తిగా తడుస్తుంది. ఈ విషయాన్ని వామకేశ్వరతంత్రంలో వివరిస్తూ



**భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా ।**
**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽ శుభా ॥**
**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**
**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥**
**వజ్రాసనగతో స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।**
**వాయుమూర్ధగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥**
**వాయ్వాఘాతవశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**
**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితో విరాట్ ॥**
**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్యతః ।**
**బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥**
**సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే**
**సా చావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్ ॥**

1. భుజంగాకారము ధరించి తామరతూడులోని దారమువలె సన్నగా మెరుపు తీగలాగా ప్రకాశిస్తూ ఆ కుండలినీ శక్తి మూలాధారాన్ని ఆశ్రయించి ఉన్నది.

2. ఆ శక్తి ఆధారచక్రము యొక్క మూలకందమును తామరదుద్దువలె నోటితో కరచిపట్టుకుని బ్రహ్మరంధ్రాన్ని ఆశ్రయించి ఉన్నది.

3. సాధకుడు వజ్రాసనంలో కూర్చుని, శ్వాసను పైకివదులుతూ కుంభకము చెయ్యాలి. అంటే గాలిని లోపలికి పీల్చి అట్టిపెట్టాలి.

4. ఆ వాయువు యొక్క తాకిడికి స్వాధిష్టానంలో ఉన్న అగ్నిప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది.

5,6. ఆ తరువాత ఆ శక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తుంది. అట్టి స్థితిలో ఉన్న ఆమెయే పరాశక్తి. నిత్యసుఖకారిణి.

గ్రంధిత్రయాన్ని భేదించిన తరువాత ఆ కుండలినీ శక్తి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో సహస్రారం చేరుతుంది. అప్పుడు తన యొక్క నోటితో

అధోముఖంగా ఉన్న సహస్రదళపద్మాన్ని కరచిపట్టుకుంటుంది. సహస్రదళపద్మము చంద్రమండలము. ఎప్పుడైతే కుండలినీ శక్తి తననోటితో ఆ పద్మాన్ని కరచిపట్టుకున్నదో, అప్పుడు అక్కడ ఉన్నటువంటి అమృతము, ఆ రంధ్రాల ద్వారా క్రిందికి జాలువారి సాధకుని యొక్క శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు సాధకుడు అవ్యాజమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతాడు. ఈరకంగా పరమేశ్వరియైనకుండలినీ శక్తి అమృతపానమునందు ఆసక్తి గలది. ఆ అమృతము కులపద్మము అంటే సహస్రారము నుంచి ఆవిర్భవించింది. అందుకే కుండలినీ శక్తిని కులామృతైకరసికా అన్నారు.

కులము అంటే వర్ణము. భగవద్గీతలో శ్రీకృష్ణుడు

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగ శః ।**

అన్నాడు. అంటే మానవుడు చేసే వృత్తులననుసరించి వారిని నాలుగు వర్ణాలుగా నేను సృష్టించాను. ఈ చతుర్వర్ణాలగురించి మొదటిసారిగా యజుర్వేదంలోని పురుషసూక్తంలో చెప్పబడింది.

**బ్రాహ్మణో౽స్య ముఖ మాసీత్ బాహూ రాజన్య కృతః ।**
**ఊరూ తదస్య య ద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥**

దీనికి యథాతథంగా అర్థం చెప్పాలి అంటే ఆ విరాట్స్వరూపం ముఖంనుంచి బ్రాహ్మణులు, బాహువులనుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదాల నుంచి శూద్రులు జన్మించారు. అయితే విషయపరిజ్ఞానం పూర్తిగాలేనివారు పై వాక్యాలకు వాచ్యార్థాన్ని మాత్రమే చెబుతారు.

బ్రహ్మను గురించి తెలుసుకోవాలనుకునేవారు బ్రాహ్మణులు. సృష్టి ప్రారంభంలో సనకసనందనాదులు సంసారసుఖాలు వద్దని వాటిని త్యజించి సత్యాన్వేషణలో నిమగ్నమై పోయారు. ఆ తరువాత ఉద్భవించిన వసిష్ఠాదులు గృహస్థులైనారు. వీరు కూడా బ్రహ్మ పదార్థం కోసం వెతుకుతూనే ఉన్నారు. వీరి వంశాలు విస్తరించినాయి. వీరందరూ కొద్దిగానో గొప్పగానో సత్యాన్వేషకులే. వీరందరూ బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతుంటారు కాబట్టి వారికి బ్రాహ్మణులు అని నామకరణం జరిగింది. కొంతకాలానికి ఈ బ్రాహ్మణులకు, జ్ఞానాన్ని రక్షించవలసిన బాధ్యత



ఎవరైనా స్వీకరించవలసిన అవసరం వచ్చింది. అప్పుడు బాహుబలం గల క్షత్రియులు ఉద్భవించారు. ఆ తరువాత ధనార్జన చేయవలసిన అవసరం వచ్చింది. వైశ్యులు ఉద్భవించారు. చివరకు వీరందర్నీ పోషించవలసిన బాధ్యత, సేవించవలసిన బాధ్యత వచ్చాయి. అప్పుడు శూద్రులు జన్మించారు. ఈ రకంగా వర్ణాశ్రమధర్మాలు ఏర్పడ్డాయి. అంటే ఎవరు చేసే పనిని బట్టివారి వర్ణాన్ని నిర్ణయించానని భగవానుడు గీతలో చెప్పాడు.

బృహదారణ్యకోపనిషత్తులో మానవుడు ఉద్భవించిన విధానాన్ని వివరిస్తున్నాడు.

నామరూపాత్మకమైన సృష్టికి ఆరంభంలో ఉన్నది పరబ్రహ్మ స్వరూపమే. అదే విరాట్స్వరూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణరూపం. అంతవరకు క్షత్రియాది ఇతరవర్ణాలేవీ లేవు. క్షత్రియులు లేకపోవటంవల్ల పాలనవ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు పరమేశ్వరుడు క్షత్రియుల్ని సృష్టించాడు. దేవతలలో ఇంద్రుడు, సోముడు, వరుణుడు, రుద్రుడు, మేఘుడు, యముడు, ఈశానుడు. వీరంతా క్షత్రియులు. బ్రహ్మపదార్థాన్ని తెలుసుకోవాలనుకునే బ్రాహ్మణులకు వీరు రక్షకులు.

క్షత్రియుణ్ణి సృష్టించిన తరువాత బ్రహ్మ తన పనిలో కృతకృత్యుడు కాలేదు. అందుచేత ధనాన్ని సంపాదించటానికి, దాచిపెట్టటానికి వైశ్యజాతిని సృష్టించాడు. వీరు ధనాన్ని గురించిన రహస్యాలను దాచిపెట్టాలి. అందుచేతవారు గుహ్యాతి గుహ్యమైన ఊరువులనుంచి పుట్టారు.

వైశ్యులంతా గణాలు గణాలుగా అంటే సమూహాలుగా ఆవిర్భవించారు. వీరిలో

| | | |
|---|---|---|
| వసువులు | – | ఎనిమిది మంది |
| రుద్రులు | – | పదకొండు మంది |
| ఆదిత్యులు | – | పన్నెండు మంది |
| విశ్వేదేవతలు | – | పదమూడు మంది |
| మరుద్గణాలు | – | నలభైతొమ్మిది మంది. వీరంతా దేవవైశ్యులు. |

ఆ తరువాత సేవకులు లేకపోవటం వల్ల బ్రహ్మ తన పనిలో సమర్థుడు కాలేకపోయినాడు. అందుచేత శూద్రులను సృష్టించాడు. వీరు సేవకావృత్తి చేస్తూ భూమిని దున్ని పంటలు పండిస్తారు. ఆ కారణంగానే శూద్రులు పాదాలు నుంచి

ఉద్భవించారు. ఈ రకంగా లోకంలో ఉన్న ప్రజలను రక్షించటం కోసం మాత్రమే నాలుగుజాతులవారు సృష్టించబడ్డారు. అంతేకాని ఇందులో ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అనేదిలేదు. అందరూ పరబ్రహ్మచేతనే సృష్టించబడ్డారు. ఆ వర్ణాలనే మనం కులములు అంటున్నాము.

సాధకులు వారివారి కులాన్ని బట్టి పూజావిధానంలో వాడే సామగ్రి చెప్పబడింది.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులు | – | ఆవుపాలు |
| క్షత్రియులు | – | ఘృతము |
| వైశ్యులు | – | మధువు |
| శూద్రులు | – | ఆసవము (కల్లు) |

వర్ణభేదంతోనే కాకుండా సాధకుల కోర్కెలననుసరించి కూడా ఈ పదార్థాలు మారుతుంటాయి.

కులము అంటే సమూహము. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము. ఈ మూడింటినీ త్రిపుటి అంటారు. ఈ మూడు ఐక్యమైతేనే అమృతమయమైన ఆనందం కలుగుతుంది. మాత, మానము, మేయముల సమూహమే కులము అని చిద్గగనచంద్రికలో కాళిదాసు వర్ణించాడు. కులాన్ని అధివశించి, అమృతాన్ని స్రవింపచేస్తుంది. కాబట్టి ఆ దేవి 'కుళామృతైకరసికా' అనబడుతోంది.

శరీరమే కులం. శరీరసంబంధమైనదే కులామృతము. అలాంటి అమృతంలోని రసాన్ని ఆస్వాదించటంలో ఆసక్తి కలది ఆ దేవి.

చక్రార్చనలో విశేషార్ఘ్యపాత్రలో సంస్కరించబడిన గోక్షీరమే అమృతము. అలాంటి అమృతంతో తర్పణ, హోమము చేయబడుటలో ఆసక్తి గలది ఆ దేవి.

## 91. కులసంకేతపాలినీ

ఉపాసింపతగినది, ఉపాసించేవాడు, పూజాద్రవ్యాలు అన్నీ జ్ఞానమయాలే. కాబట్టి వాటిని ప్రతిపాదించే శాస్త్రాన్ని కూడా 'కులము' అంటారు. ఆగమాలలో

**న కులం కుల మి త్యాహుః ఆచారః కుల ముచ్యతే**



కులము అంటే వంశం కాదు. ఆచారమే కులము అని చెప్పబడింది. కల్పసూత్రాలలో **కుళపుస్తకాని చ గోపయేదితి** ఆచారం గురించి చెప్పే పుస్తకాలను దాచాలి అని చెప్పబడింది. అంటే పరమేశ్వరి పూజలో ఆచారాలకు ప్రాముఖ్యత ఎక్కువన్నమాట. అటువంటి ఆచారాలను పాటించేది దేవి. జ్ఞానులకు ఈ ఆచారాలు అవసరం లేదు. వారిది పరలోక చింతన. అందుకని దేవి ఈ ఆచారాలను జ్ఞానులకు చెప్పదు. సంప్రదాయాన్ననుసరించే వారికి, ఐహికమైన కోర్కెలు గలవారికి మాత్రమే ఈ శాస్త్ర రహస్యాలు చెబుతుంది. ఆ రహస్యాలు మూడు రకాలు **చక్రసంకేతో మంత్రపూజా సంకేతకా**

1. చక్రసంకేతము 2. మంత్ర సంకేతము 3. పూజా సంకేతము

చింతామణి స్తవములో ఈ విధంగా చెప్పబడింది.

**కులాంగనై షా పృథరాజవీథీః ప్రవిశ్య సంకేత గృహాంతరేషు ।**

**విశ్రమ్య విశ్రమ్య పరేణ పుంసా సంగమ్య సంగమ్య రసంప్రసూత ॥**

కులస్త్రీ అంటే కుండలిని రహదారిలో ప్రవేసించి (ఇక్కడ రహదారి అంటే సుషుమ్నా మార్గము) రహస్య స్థానాలలో (షట్చక్రాలయందు) విశ్రాంతి పొందుతూ పరపురుషుని (సహస్రారంలో పరమేశ్వరుణ్ణి) చేరి అమృతపు సరస్సులోకి ప్రవేశిస్తోంది.

బ్రాహ్మణాది వర్ణాలు, బ్రహ్మచర్యాది అవస్థలు, పిత్రువంశము యొక్క ధర్మాలు, గురువుగారి వంశము మొదలైనవి. వీటన్నింటినీ కులసంకేతము అంటారు.

కుండలినీ శక్తి సుషుమ్నా మార్గంగుండా గ్రంథిత్రయాన్ని భేదించుకుని సహస్రారం చేరటాన్నే "కులసంకేతపాలన" అంటారు. దేవి ఈ ఆచారాలను పాటిస్తుంది కాబట్టి ఆమెను కులసంకేతపాలిని అని చెప్పటం జరిగింది.

మూలాధారము నుంచి ఆరు చక్రాలున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. గుద స్థానంలో | – | మూలాధారము |
| 2. లింగస్థానంలో | – | స్వాధిష్ఠానము |
| 3. నాభిస్థానంలో | – | మణిపూరము |
| 4. హృదయస్థానంలో | – | అనాహతము |

5. కంఠస్థానంలో - విశుద్ధి చక్రము

6. భృకుటి స్థానంలో - ఆజ్ఞా చక్రము

వీటన్నింటికీ పైన సహస్రదళ పద్మమున్నది. వీటన్నింటినీ కలిపి 'కులము' అంటారు.

శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 10వ శ్లోకంలో కుండలినీ శక్తిని స్తుతిస్తూ

**సుధాధారాసారై శ్చరణయుగళాంతర్విగళితైః**
**ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయ మహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయం**
**స్వ మాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణీ ॥**

తల్లీ ! నీ పాదయుగము నుండి స్రవించు సుధాధారలచే ప్రపంచమును తడుపుచు అమృతమునకు నిధానమై కాంతిచే వెలుగొందు చంద్రుని వీడి స్వస్థానమైన ఆధారచక్రమును మరల బ్రాపించి, అందు స్వస్వరూపమును సర్పమువలె కుండలాకారము కావించి తామరదుద్దు నడుమనుండు సన్నని రంధ్రమువలె మిక్కిలి సూక్ష్మమైన పృథివీతత్త్వమునందు కుండలినీ శక్తివై నిద్రింతువు అంటారు. ఇది కులసంకేతపాలన అంటే

## 92. కులాంగనా

కులము అంటే పాతివ్రత్యాది గుణశీలమైన వంశము. తల్లివైపు, తండ్రివైపు సక్రమమైన వంశము గలిగి, రూపవిద్యాశీల భావములు కలిగిన స్త్రీ ఉత్తమ కుల సంజాత, తనను బోలిన సత్కుల సంజాతుడు, సకల విద్యాపారంగతుడు, ఉత్తముడు అయిన వ్యక్తిని వివాహమాడి, అన్ని విషయములలోను భర్తలోనే పరమాత్మ్ముణ్ణి చూస్తూ

స్థూలదేహ బుద్ధితో - భర్తకు దాసిగా

సూక్ష్మదేహ బుద్ధితో - తాను భర్త యొక్క అంశ అని

పారమార్థిక బుద్ధితో - తనకు భర్తకు భేదము లేదని



తన భర్తకన్న అన్యము శూన్యమని తలచి మనోవాక్కాయ కర్మలచే భర్తనే అనుసరించు స్త్రీ 'కులాంగన' అనబడుతుంది. అటువంటి రూపంలోనే పరమేశ్వరి ఉంటుంది కాబట్టి ఆమె కులాంగనా అని స్తుతించబడుచున్నది.

పతివ్రత అయిన స్త్రీ ఏ రకంగా రక్షించబడుతోందో, ఆ రకంగానే శ్రీవిద్య కూడా దాచబడుచున్నది. కులార్ణవ తంత్రంలో

**అన్యా స్తు సకలా విద్యాః ప్రకటా గణికా ఇవ ।**
**ఇయం తు శాంభవీ విద్యా గుప్తా కులవధూ రివ ॥**

ఇతర విద్యలు వేశ్యవలె బాహ్యమైనవి. శ్రీవిద్య కులస్త్రీవలె గుప్తమైనది. అంతర్ముఖులైన వారికి మాత్రమే దేవి తన స్వరూపాన్ని ప్రకటింపచేస్తుంది.

## 93. కులాంతస్థా

కులము యొక్క మధ్యలో గౌరవప్రదంగా ఉండేది పరమేశ్వరి. మాతృ, మాన, మేయములలో మానరూపంగా తెలియతగినది. కులశాస్త్రముల మధ్యలో తెలియ తగినదిగా ఉన్నది.

కులము అంటే విద్యావంశము. తన గురుసంప్రదాయానికి చెందిన అందరి యొక్క సమూహాన్నీ కులమంటారు. ఈ సమూహం మధ్యన ఉంటుంది కాబట్టి దేవి కులాంతస్థా అనబడుతోంది.

ప్రాణికోటిలోని జాతులన్నీ కులాలు. ఇక్కడ జాతులు అంటే మానవ, పశు, పక్ష్యాదులు. దీనిలో, మానవజాతిలో నాలుగు వర్ణాలు, స్త్రీ పురుష జాతులు ఉన్నాయి. స్త్రీలలో అనేక జాతులు, పురుషులలో అనేక జాతులు. ఈ రకంగా కన్ను, ముక్కు, చెవి, నోరు మొదలైన అవయవ భేదంచేత 33 రకాలున్నాయని చెప్పబడుతోంది. వీటన్నింటిలోను పరమేశ్వరి ఉన్నది. అంటే దేవి సర్వాంతర్యామి.

మూలాధారమధ్యలో ధ్యానింపతగినది దేవి. అని కులశాస్త్రాలు చెబుతున్నాయి. సమయాచారులు మణిపూరంలో దేవిని ధ్యానిస్తే కౌళులు ఆధార స్వాధిష్ఠానాలలో దేవిని అర్చిస్తారు. ఇక్కడ కౌళాచారాన్ని క్లుప్తంగానైన చెప్పటం ఎంతైనా అవసరము.

పురుషార్థాలలో అర్థకామాలకే ప్రాధాన్యతనిచ్చేవారు కౌళులు, వీరికి బాహ్యపూజయేకాని అంతఃపూజ లేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. కౌళాగమాలుగా పిలవబడే 64 తంత్రాలు వీరికి ప్రామాణికాలు. ఇవే దేవి పూజకు ఉత్తమమైనవని వీరి నమ్మకము. వీటి వివరాలు ఈ అధ్యాయంలోనే మొదట ఇవ్వబడినాయి.

కౌళులు షట్చక్రాలలో ఆధారచక్రాన్ని పూజిస్తారు. కుః అంటే పృథివీతత్త్వము. అది షట్చక్రాలలోను ఏచక్రమందున్నదో దాన్నే కులము అంటారు. అది ఆధారచక్రంలో ఉంటుంది. వీరు శ్రీచక్రానికి బాహ్యపూజ చేస్తారు. పృథివీ తత్త్వాత్మకమైన ఆధారచక్రాన్ని పూజిస్తారు. అందుకే వీరి ఆచారాన్ని కౌళాచారము అంటారు. ఆధారచక్రమే త్రికోణం. అందులోనే బిందు ఉన్నది. కౌళమతానుసారం త్రికోణమే బిందుస్థానం. బిందువే త్రికోణమునందు ఆరాధింపతగినది. కౌళాచారులు రెండు రకాలు.

1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీ పత్రము, పట్టువస్త్రము, బంగారు వెండి రేకులమీద వ్రాసి దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు. ఉత్తరకౌళులు స్త్రీ యొక్క ప్రత్యక్షయోనిని పూజిస్తారు. ఈ రెండు రకాల పూజలూ బాహ్యపూజలే. అందుచేత వారికి ఆధారచక్రమే పూజనీయమౌతుంది. అందులో ఉండే కుండలినినే కౌళిని అంటారు. త్రికోణపూజలో కౌళినియే ఉపాశ్య. ఆధారచక్రంలో కుండలినీ శక్తి సర్పాకారం ధరించి నిద్రావస్థలో ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కుండలినీశక్తి పూజింపతగినదే. అందుకే ఆ పూజను తామిశ్రము అంటారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వాటిమీద కౌళులకు మాత్రమే అధికారం ఉంది. కుండలినీ ప్రబోధము ఎప్పుడు కలుగుతుందో, ఆ క్షణంలోనే వారికి ముక్తి కలుగుతుంది. వీరికి త్రికోణంలో భైరవీ భైరవులు పూజనీయులు. అందుచేతనే వారు ఆధారచక్రంలో శివశక్తులను భైరవీ భైరవులంటారు.

**జపాకుసుమ సంకా సౌ మధుఘూర్ణిత లోచనౌ ।**
**జగతః పితరౌ వందే భైరవీ భైరవాత్మ కౌ ॥**



ఆధారచక్రంలో భైరవీ భైరవులు జపాకుసుమము అంటే ఎర్రని మంకెన పూవు వంటి రంగుతో మధువును త్రాగటంచేత మత్తెక్కిన కళ్ళతో ఉన్నటువంటి, ఈ జగత్తుకు తల్లిదండ్రులయినటువంటి భైరవి, భైరవులకు నమస్కరిస్తున్నాను.

## 94. కౌళినీ

భవిష్య పురాణంలో

**పూజనీయా జనై ర్దేవీ స్థానే స్థానే పురే పురే ।**
**గృహే శక్తి పరై ర్గ్రామే గ్రామే వనే వనే ॥**

శాక్తేయులైన జనులచేత దేవి ప్రతి పట్టణము నందు, ప్రతి వనమునందు, ప్రతి గ్రామమునందు, ప్రతి గృహమునందు పూజింపబడదగినది.

తంత్రసారంలో

**కుళం శక్తిరితి ప్రోక్తం కులం శివ ముచ్యతే ।**
**కుళాకుళత్వ సంబంధః కౌళ మి త్యభిధీయతే ॥**

కుళము అంటే శక్తి. అకుళము అంటే శివుడు. కుళాకుళ సంబంధమే కౌళము. అంటే శివశక్తుల సంబంధమే కౌళము అని చెప్పబడింది.

మానవదేహంలో బ్రహ్మరంధ్రం క్రింద గల సహస్రారంలో తెల్లనిరంగులో ఉన్న వేయిదళములు కల పద్మమున్నది. అలాగే మూలాధారములో రక్తవర్ణ సహస్రదళమున్నది. వీటిని అకులా, కులపద్మాలంటారు. ఇవే శివశక్తి స్థానాలు. శివశక్తుల సామరస్యము కౌళము. ఆ కౌళము గలది కౌళిని.

## 95. కులయోగినీ

బాహ్యప్రదేశములో శ్రీచక్రాన్ని వ్రాసి పూజించే పద్ధతిని కౌళము అంటారు. కౌళాచారాన్ని 93వ నామంలో వివరించటం జరిగింది. కులపద్మంలో కుండలినీ స్వరూపంలో ఉండే దేవతను కులయోగిని అంటారు. శ్రీచక్రంలోని ఆవరణలలో ఉండే దేవతలను యోగినులు అంటారు. వీరందరూ దేవితోపాటుగా సమానమైన రూపలావణ్య పరాక్రమాలు కలిగి ఉంటారు. ప్రతి ఆవరణలోను వారిని ఒక్కొక్క పేరుతో పిలుస్తారు.

1. భూపురంలో – ప్రకట యోగినులు
2. షోడశదళంలో – గుప్తయోగినులు
3. అష్టదళంలో – గుప్తతరయోగినులు
4. మన్వస్రములో – సంప్రదాయ యోగినులు
5. బహిర్దశారములో – కుళోత్తీర్ణ యోగినులు (కులయోగినులు)
6. అంతర్దశారములో – నిగర్భయోగినులు
7. అష్టకోణములో – రహస్యయోగినులు
8. త్రికోణములో – అతిరహస్య యోగినులు
9. బిందువులో (సర్వానందమయ చక్రం) – పరాపర రహస్యయోగినులు

ఇందులో బహిర్దశారంలో ఉండే దేవతలను కులయోగినులు అంటారు. ఈ దేవతలరూపం కలది కాబట్టి పరమేశ్వరి కులయోగిని అనబడుతోంది.

పధ్నాలుగు లోకాలలోను మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయి. ఆ జీవుల యొక్క కర్మఫలాన్ననుసరించి భవిష్యత్తును ఏర్పాటుచేయు పరాత్పరిని కులయోగిని అంటారు.

**బాహ్యపూజారతాః కౌళాః క్షపణాశ్చ కపాలికాః**
**దిగంబర శ్చేతిహాసాః వామకా స్త్రంత్ర వాదినః**

కౌళాచారము అనేది బాహ్యపూజ. క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, తంత్రవాదులు వామాచారులు మాత్రమే ఈ పూజను చేస్తారు.

**2. మిశ్రమాచారులు :** కౌళ, సమయాచారాలను కలిపి ఆచరించేవారిని మిశ్రమాచారులు అంటారు. వీరికి 1. చంద్రకళ, 2. జ్యోత్స్నావతి, 3. కళానిధి, 4. కులార్ణవ, 5. కులేశ్వరి, 6. భువనేశ్వరి, 7. బార్హస్పత్య, 8. దుర్వాస తంత్రాలు ప్రామాణికాలు. వీటిలో ధర్మకర్మ ఉపాసనల వివరణ, కుండలినీ శక్తి సాధన చెప్పబడింది. అన్ని వర్ణములవారికీ వీటిని సాధించే అధికారమున్నది. కాని మొదటి మూడు వర్ణములవారు సవ్యమార్గంలోనే సాధించాలి. ఈ తంత్రాలు మిశ్రమాచారానికి సంబంధించినవి కాబట్టి వదలివెయ్యాలి.



చంద్రకళాష్టకము కౌళ, సమయమతాలు రెండింటినీ అనుసరించటంవల్ల మిశ్రమతంత్రము అన్నారు.

**మిశ్రకం కౌళమార్గం చ పరిత్యాజ్యంచ శాంకరీ**

అనే ఈశ్వరవచనము ఆధారంగా, మిశ్రమాచారాన్ని కూడా కౌళాచారంగానే పరిగణించి వదలి వెయ్యాలి. ఈ రకంగా 72 తంత్రాలను వదలివెయ్యాలి.

**3. సమయాచారులు :** ప్రాచీన సంప్రదాయంలో వైదిక పద్ధతిలో నిర్ణయించ బడిన ఆచారాన్ని సమయాచారము అంటారు. దక్షిణామూర్తి ఋషిగా కామేశ్వరీ కామేశ్వరులు అధి దేవతలుగా ఉన్న మంత్రానుష్టానమే సమయాచారము. సమయ మతంలో ప్రధానమైనది కేవలం కైవల్య పారమార్థిక దృష్టి. కర్మకాండలవల్ల మోక్షము లభించదు. అని వీరు నమ్ముతారు. జీవబ్రహ్మైక్యమే వీరి సిద్ధాంతము. వీరికి శుభాగపంచకము అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వసిష్ఠ, శుకసంహితలు ప్రమాణాలు. సయమాచారులకు బాహ్యపూజ లేదు. అంటే వారు శ్రీచక్రాన్ని వేరుగా పూజించరు. ఇదే విషయాన్ని సనత్కుమార సంహితలో ఈ విధంగా చెప్పేరు.

**బాహ్య పూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్య జాతిభిః**
**సాక్షుద్రఫలదా నృణాం ఐహికార్థైక సాధనాత్ ॥**
**బాహ్య పూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః ।**
**దిగంబరాశ్చేతిహాసాః వామకాస్తంత్రవాదినః ॥**
**అంతరారాధనపరా వైదికా బ్రహ్మావాదినః ।**
**జీవన్ముక్తావ్పరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా ॥**

ఉత్తమజాతులవారికి బాహ్యపూజ కర్తవ్యము కాదు. బాహ్యజాతులవారు మాత్రమే బాహ్యపూజ చెయ్యాలి. బాహ్యపూజ అనేది ఐహిక ప్రయోజనము సాధించటానికి ఉపయోగిస్తుంది. ఇది అల్పప్రయోజనకారి. కౌళులు. క్షపణికులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, (జాలవిద్యారతులు) వామాచారులు,

తంత్రవాదులు అందరూ బాహ్యపూజారతులు. బ్రహ్మవాదులైన వైదికాచారులు అంతరారాధనాపరులు, వీరు జీవన్ముక్తులై మూడు లోకాల్లోనూ సదా సంచరిస్తూ ఉంటారు. మోక్షప్రాప్తికై నిర్గుణబ్రహ్మ ఉపాసనే కాక స్వర్గ వైకుంఠాది లోకప్రాప్తికై శ్రుతిస్మృతులచే బోధింపబడిన కర్మలు సమయులకు అనుసరణీయములు. చంద్రజ్ఞాన విద్యలో చెప్పినట్లుగా సమయాచారులు.

**సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం**
**పాశాంకుశ ధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥**

సూర్యమండలము మధ్యనున్న త్రిపురసుందరిని, పాశము, అంకుశము, ధనుర్బాణములు ధరించిన దానిని పూజించాలి.

సమయాచారులలో ఒక తెగవారికి మాత్రం బాహ్యపూజ వుంది. అంటే వారు విడిగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. మూలమంత్రానికి అంతఃపూజలో ఋషి, ఛందస్సు అవసరం లేదు. కేవం బాహ్యపూజలోనే అవి కావాలి.

సమయాచారులు శివశక్తులను సమయుడు, సమయ అంటారు. సమయ అంటే శివునితో ఐదురకాలుగా సామ్యము పొందిన శక్తి. అలాగే శివుడు కూడా శక్తితో ఐదు రకాలుగా సామ్యము పొందుతున్నాడు. ఈ రకంగా శివశక్తులకు సామ్యము ఉన్నది అని వీరి నమ్మకము. అందుకే వీరి ఆచారాన్ని సమయాచారము అంటారు.

సామ్యము అంటే పోలిక. శివశక్తులు ఐదు రకాలుగా ఒకే పోలిక కలిగి ఉంటారు. అవి :

**1. అధిష్ఠాన సామ్యము :** శివశక్తులు ఇద్దరూ ఒకే స్థానాన్ని అధిష్ఠించి ఉండటం.

**2. అనుష్ఠాన సామ్యము :** ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము.

**3. అవస్థాసామ్యము :** ఇద్దరూ ఒకే అవస్థలో నిమగ్నమై ఉండటము.

**4. రూపసామ్యము :** ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము.

**5. నామసామ్యము :** ఇద్దరి పేర్లూ ఒకే రకంగా ఉండటము.



సమయాచారులకు ప్రధానమైనది కైవల్యప్రాప్తి. 'శుభాగమపంచకము' అనే ఐదుసంహితలలో, వైదికమార్గంలో ఉపాసనా విధానము చెప్పబడింది. ఈ మార్గాన్ని వశిష్ఠ, సనక, సనందన, సనత్కుమార, శుకమహర్షులు వివరించారు. ఇదే సమయాచారము. గౌడపాదులవారు, శంకర భగవత్పాదులవారు ఈ మార్గాన్నే నిర్దేశించారు.

శుభాగమ పంచకంలో షోడశనిత్యల ప్రతిపాదన చెప్పబడింది. ఈ షోడశ నిత్యలు చంద్రవిద్యలో అంగభూతాలు. అయితే చతుష్షష్టి తంత్రాలలోను చంద్రజ్ఞాన విద్య కూడా చెప్పబడింది. కాని ఈవిద్య ఇక్కడ కౌళాచారములో చెప్పబడింది. అదే చంద్రజ్ఞానవిద్యను శుభాగమ పంచకంలో సమయాచారంలో చెప్పటం జరిగింది. వశిష్ఠ సంహితలోని చంద్రజ్ఞానవిద్యలో షోడశనిత్యలను వివరించటం జరిగింది. పరమేశ్వరి షోడశనిత్యలను వివరించమని పరమేశ్వరుణ్ణి అడుగుతుంది. అప్పుడు ఈశ్వరుడు చెబుతున్నాడు.

**శృణుదేవీ ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ**
**నకస్య చిన్మయాఖ్యాతం సర్వతంత్రేషు గోపితం**

ఓ పరమేశ్వరీ ! అన్ని తంత్రాలయందు గోప్యముగా ఉన్నది. ఇంతవరకు ఎవరికీ చెప్పనిది అయిన షోడశనిత్యలను గూర్చి చెబుతున్నాను వినవలసినది.

**తత్రాదౌ ప్రథమా నిత్యా మహాత్రిపురసుందరీ**
**తతః కామేశ్వరీ నిత్యా, నిత్యాచ భగమాలినీ ॥**
**నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్నివాసినీ**
**మహావజ్రేశ్వరీ రౌద్రీ, త్వరితా కులసుందరీ ॥**
**నిత్యా నీలపతాకాచ విజయా సర్వమంగళా**
**జ్వాలామాలిని చిద్రూపాః ఏతానిత్యాస్తు షోడశః ॥**
**ప్రతివత్ ప్రభృతౌ దేవ్యాః పౌర్ణమాస్యంత మర్చయేత్**
**ఏకాది వృద్ధ్యా హాన్యాంచ దర్శాంతం దేవివిగ్రహమ్ ॥**

| | | |
|---|---|---|
| 1. మహాత్రిపురసుందరి | 6. వహ్నివాసిని | 11. నిత్యా |
| 2. కామేశ్వరి | 7. మహావజ్రేశ్వరి | 12. నీలపతాక |
| 3. భగమాలినీ | 8. రౌద్రి (శివదూతి) | 13. విజయ |
| 4. నిత్యక్లిన్నా | 9. త్వరితా | 14. సర్వమంగళా |
| | | 15. జ్వాలామాలిని |
| 5. భేరుండా | 10. కులసుందరీ | 16. చిత్ర (చిద్రూప) |

పాడ్యమి నుంచి పౌర్ణమి వరకు వీరిని అర్చించాలి. శుక్లపక్షంలో పెంచుకుంటూ, కృష్ణపక్షంలో తగ్గించుకుంటూ రావాలి. చంద్రకళలు పదహారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 5. పుష్టి | 9. చంద్రికా | 13. ప్రీతి |
| 2. మానదా | 6. రతి | 10. కాంతి | 14. అంగదా |
| 3. పూషా | 7. ధృతి | 11. జ్యోత్స్న | 15. పూర్ణా |
| 4. తుష్టి | 8. శశిని | 12. శ్రీ | 16. పూర్ణామృతా |

షోడశకళాప్రపూర్ణుడు చంద్రుడు. పదహారు కళలతోను కూడినవాడు. అయితే ఈ పదహారు కళలు ముందుగా జ్యోతిరూపుడైన సూర్యునిలో ఉంటాయి. ఆ రోజున చంద్రునితో ఒక్క కళకూడా ఉండదు. ఆ రోజు అమావాస్య. ఆ తరువాత శుక్లపక్ష పాడ్యమి నుండి ప్రతిరోజూ ఒక్కొక్కకళ సూర్యునినుండివచ్చి చంద్రునిలో చేరుతుంది. ఈ రకంగా శుక్లపక్ష పాడ్యమి నుంచి పౌర్ణమివరకు పదిహేను కళలు వచ్చి చంద్రునిలో చేరతాయి. మరి పదహారవకళ ఏది అంటే **షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ** పదహారవకళ సాక్షాత్తూపరమేశ్వరి అయి ఉన్నది. ఇక కృష్ణపక్షం అంటే పౌర్ణమి మరునాడు. బహుళ పాడ్యమి. ఆ రోజు నుంచి ఒక్కొక్కకళ చంద్రుని విడిచి సూర్యునిలో చేరుతుంది. ఈ రకంగా అమావాస్య వచ్చేసరికి పదిహేనుకళలు చంద్రుని విడిచి వెళ్ళిపోతాయి. పరమేశ్వరి అర్చనా విధానంలో నిత్యార్చన అని ప్రత్యేకంగా ఉన్నది. సాధకుడు ప్రతిరోజూ ఆ తిథి నిత్యను అర్చిస్తూ, మహానిత్యను విధిగా అర్చించాలి. అయితే పాడ్యమి మొదలైన తిథులు నిత్యాస్వరూపాలు. అలాగే నిత్యలు కళాస్వరూపాలు.



షోడశనిత్యలు అంగభూతములై శ్రీచక్రంలో అంతర్భావం పొందుతున్నాయి. ఈ షోడశనిత్యలు అష్టవర్గస్వరూపాలై అంటే **అకచటతపయశ** అనే వర్గల రూపం పొంది శ్రీచక్రంలోని మూడవ ఆవరణ అయిన సర్వసంక్షోభణ చక్రము (ఇది ఎనిమిది దళాలు గల పద్మము)లో ఉంటాయి. అలాగే అష్టకోణచక్రము (ఇది ఏడవ ఆవరణ. సర్వసిద్ధిప్రద చక్రము)లో తూర్పువైపున ఉన్న కోణమునుంచి ఒక్కొక్క కోణానికి ఇద్దరు చొప్పున 8×2=16 మంది నిత్యాదేవతలు ఉంటారు. ఈ నిత్యాదేవతలే 'సర్వాశా పరిపూరక చక్రము' అనబడే షోడశదళము (ద్వితీయావరణ)లో ఉన్నారు. ఈ నిత్యలే దశారయుగ్మములో ఉన్నారు. వీరిలో మొదటి రెండు నిత్యలు బిందు త్రికోణములయందు, మిగిలిన పద్నాలుగు చతుర్దశారమందు ఉన్నారు. ఇక మేఖలాత్రయము, భూపురత్రయము. ఈ రెండూ బిందువు, త్రికోణములందు అంతర్భూతములు. ఈ రకంగా నిత్యాదేవతల అంతర్భావాన్నే మేరుప్రస్తారము అంటారు. ఇదే నిత్యాతాదాత్మ్యము.

సనందనసంహితలో "ఈ షోడశనిత్యలు చంద్రకళ అయిన చంద్రవిద్యకు అంగభూతములు. షోడశనిత్యలు స్వరాల (అచ్చుల) రూపముగలవారై, పంచదశీ మహామంత్రంలో అకార విసర్గాంతము, సకారము– ఈ రెండింటిచేత తీసుకోబడ్డవై, జీవకళారూపాలై, బైందవ స్థానమున స్థాపించబడినవై, అక్కడే అంతర్భూతములై ఉన్నాయి. వర్గలు ఐదు అనగా **కచటతప** మొత్తం 25 అక్షరాలు పాశాంకుశ బీజయుక్తములై అష్టారమునందు, దశకోణ ద్వయమునందు అంతర్భూతములై ఉన్నాయి. మిగిలిన తొమ్మిది అక్షరాలు (యరలవశషసహళ) మన్వస్రంలో రెండు ఆ వృత్తులచేత పద్నాలుగు కోణములందు అంతర్భూతములు అవుతున్నాయి. ఇలా పోగా నాలుగు అక్షరాలు మిగులుతాయి 9×2=18−14=4 ఈ నాలుగు అక్షరాలు శివచక్రాలు నాలుగింటియందు అంతర్భూతములు. ఇది కైలాస ప్రస్థార విశేషము" అని చెప్పబడింది. ఇదే మాతృకా తాదాత్మ్యము.

సనత్కుమార సంహితలో "షోడశ నిత్యలు ఇద్దరిద్దరుగా వశిన్యాది దేవతలతో కలిసి అష్టకోణములోని ఎనిమిది కోణాలయందు అంతర్భూతం చెందుతున్నారు. అలాగే వసిన్యాది దేవతలు ఎనిమిది మంది, యోగినులు పన్నెండు. వెరసి ఇరవై. దశారయుగ్మంలో ఉంటారు. ఈ రకంగా వర్గలు ఎనిమిది (అకచటతపయశ),

వశిన్యాది దేవతలు ఎనిమిది, నిత్యలు పదహారు, యోగినులు పన్నెండు. వెరసి నలభై నాలుగు మంది. వీటిలో మహాత్రిపురసుందరి బిందువు నందుండగా, మిగిలిన 43 మంది 43 కోణాలలో అంతర్భూతం చెందుతారు. శ్రీచక్రంలో మొత్తం కోణాలు 45 కాని నేలమీద గీసి చూసినట్లైతే అష్టకోణంలోని రెండు కోణాలు త్రికోణంలో అంతర్భావం చెందుతాయి. అందుచేత 43 కోణాలే లెక్కలోకి వస్తాయి. ఇక గంధాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి అనబడే నలుగురు ఆకర్షణ దేవతలు భూపురంలోని నాలుగు ద్వారాలయందు ఉంటారు. ఇది భూప్రస్తారము. ఇదే వశిన్యాది తాదాత్మ్యము. ఈ విషయాలు గతంలో చెప్పినప్పటికీ, చదువరుల సౌలభ్యం కోసం మళ్ళీ చెప్పటం జరిగింది.

వేదంలో రెండు రకాల విద్యలు చెప్పబడ్డాయి. 1. పరావిద్య, 2. అపరావిద్య. పరావిద్య అనేది మోక్షమార్గము. అపరావిద్య అనేది లౌకికమార్గము. ఇది ఉన్నత పదవులు, సంసారసుఖాలు, ధనార్జన, వ్యాపారోన్నతి, భోగభాగ్యాలు పొందటానికి ఉపయోగిస్తుంది. అయితే ఇప్పటిదాకా చెప్పిన ఈ అరవైనాలుగుతంత్రాలు, అపరావిద్య సాధించటానికి ఉపయోగించేవే. ఇది క్షణికానందానిస్తుంది. మోక్షమార్గాన్ని చూపదు. లౌకిక విషయాలలో ముంచి తేలుస్తుంది. దీనిని అనుసరించినవాడు ఎంతటిపండితుడైనప్పటికి సంసార సాగరంలో పడి గానుగకు కట్టిన ఎద్దులాగా తిరుగుతూ ఉంటాడు. అందుకే పార్వతీదేవి తన భక్తులను రక్షించాలనే ఉద్దేశ్యంతో వారికి మోక్షం ప్రసాదించాలనే కోరికతో, పరమేశ్వరుని ప్రార్థించి **'శ్రీవిద్యాతంత్రము'** అనే స్వతంత్ర తంత్రాన్ని ఈశ్వరునిచే ఇప్పించింది. సర్వశాస్త్రాలు, వేదాలు, ఇతిహాసాలు, మంత్రాలు అన్నీ ఈశ్వరుని నుంచే వచ్చినాయి అని మనం గుర్తుంచుకోవాలి. శ్రీవిద్యాతంత్రము అంటే పంచదశీ మహామంత్రమే అన్నారు లొల్లా లక్ష్మీధరులు. సౌందర్యలహరిలోని 31వ శ్లోకంలో శంకర భగవత్పాదుల వారు శ్రీవిద్యలోని ఆచారాలను ఈ విధంగా వివరించారు.

**చతుష్షష్ట్యా తన్త్రైః సకల మతిసన్ధాయ భువనం**
**స్థిత స్తత్త త్సిద్ధి ప్రసవపరతన్త్రైః పశుపతిః**
**పునస్త్వన్నిర్బన్ధా దఖిల పురుషార్థైకఘటనా**
**స్వతన్త్రం తే తన్త్రం క్షితితల మవాతీతరదిదమ్ ॥**



తల్లీ ! పశుపతి అయిన నీ భర్త ఆ పరమేశ్వరుడు, ఐహిక సంబంధమైన అగ్ని స్తంభన, వాయుస్తంభన, ఆకాశ గమనము, పరకాయ ప్రవేశము వంటి విద్యలను లోకానికి అందజేశాడు. ఈ విద్యలను ఆధారం చేసుకుని లోకంలోని పండితులు కూడా మహామోహములో పడిపోయి మోక్షాన్ని మరచిపోతున్నారు. అది గమనించిన నీవు మోక్షసాధనమైన ఒక తంత్రాన్ని చెప్పమని అడగగా పరమేశ్వరుడు శ్రీవిద్యా తంత్రాన్ని ఉపదేశించాడు. ఇది సమయాచార తంత్రము.

సమయాచారాన్ని గురించి లలితా సహస్రంలో 96, 97, 98 నామాలలో వివరించడం జరిగినది.

## 96. అకులా

సుషుమ్న నాడికిపైన గల సహస్రదళ పద్మాన్ని 'అకులము' అంటారు. షట్చక్రాలను దాటిన తరువాత సహస్రదళ పద్మము ఉంటుంది.

సహస్రదళ పద్మంలో ఎనిమిది పెద్దపెద్ద దళాలు ఎనిమిది దిక్కులకూ ఉంటాయి. ఒక్కొక్క దళంలో మళ్ళీ చిన్నచిన్న దళాలు 125 చొప్పున ఉంటాయి. ఈ రకంగా ఈ పద్మంలో వేయిదళాలు ఉంటాయి. మానవశరీరంలో రెండు సహస్రదళ పద్మాలున్నాయి. ఒకటి ఆధారచక్రానికి దిగువన, రెండవది ఆజ్ఞా చక్రానికిపైన వీటిలో క్రింద భాగాన ఉన్నది కులమని, పైన ఉన్నదాన్ని అకులమని అంటారు. కొన్నిచోట్ల కులము, అకులము అనేపేర్లు అటు ఇటు చెప్పబడుతున్నాయి. ఈ విషయం పాఠకులు గమనించగలరు. స్వచ్ఛందతంత్రంలో పరమేశ్వరి ఈ రెండు పద్మాలతోనూ కలిసి కులాకులమయ స్వరూపిణిగా ఉంటుంది అని చెప్పబడింది. సహస్రారానికి క్రింద భాగంలో, లలాటానికి పైన అకుల రూపంలో షట్చక్రాలతో సంబంధం లేకుండా సుధాసాగరంలో ప్రవేశించి ఆ పరమేశ్వరి విహరిస్తుంటుంది. ఆమె 'అకుల'

కులము, వంశము, జాతి, మొదలగు పదములచే సూచించబడేవన్నీ ఇంద్రియాలకు, ప్రాణాలకు సంబంధించినవి. కేవలము జ్ఞానస్వరూపిణి అయిన పరమేశ్వరికి వాటితో సంబంధం లేదు కాబట్టి ఆమె అకుల అనబడుతున్నది.

## 97. సమయాంతస్థా

హృదయాకాశంలో శ్రీచక్రాన్ని ఊహించి అక్కడ పరమేశ్వరిని అర్చించటాన్నే సమయమతం అంటారు. ప్రాచీన సంప్రదాయంలోని వైదిక పద్ధతిలో నిర్ణయించబడిన ఆచారాన్ని సమయాచారము అంటారు.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని నిద్రలేపి, షట్చక్రాలను దాటించి, సహస్రారానికి చేర్చి, మళ్ళీ ఆ శక్తిని అవరోహణ క్రమంలో మూలాధారానికి చేర్చటమే సమయాచారము.

బండి చక్రంలో నేలమీద తిరిగే పట్టా, చక్రానికి ఉన్న ఆకులు, ఇవన్నీ లోపల ఉన్న ఇరుసును ఆధారంగా చేసుకుని తిరుగుతాయి. అలాగే పంచకోశాలు లోపల ఉండే వస్తువును ఆధారంగా చేసుకుని ప్రవర్తిస్తాయి. దానినే 'అంతస్థా' అంటారు. వైదిక కర్మలు చేసే సమయాచారుల అంతస్థమున ఉండునది ఆ పరమేశ్వరి అందుచేత ఆమె సమయాంతస్థా అనబడుతోంది.

సమయాచార గ్రంథాలచే ప్రతిపాదించబడుతోంది కాబట్టి సమయాంతస్థా అనబడుతోంది. శివాశివులకు పంచసామ్యాలున్నాయని ముందే చెప్పాం. ఆ పంచసామ్య రూపంలో ఉండేది కాబట్టి సమయాంతస్థా అనబడుతోంది.

## 98. సమయాచారతత్పరా

సమయాచారమునందు ఆసక్తిగలది ఆ పరమేశ్వరి. సమయాచారాన్ని గురించి ముందే వివరించటం జరిగింది. దక్షిణామూర్తి ఋషిగా, కామేశ్వరీ కామేశ్వరులు అధిదేవతలుగా ఉన్న మంత్రానుష్ఠానమే సమయాచారము. శివశక్తులకు పంచసామ్యమున్న దని చెప్పటమే సమయాచారము. ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని నిద్రలేపి సహస్రారానికి చేర్చి మళ్ళీ ఆ శక్తిని ఆధారచక్రానికి చేర్చటమే సమయాచారము. వ్యాస, పాణిని, సూర్య, పింగళ, యాస్క, మను, యాజ్ఞవల్క్య, ఆపస్తంబ, గౌతమ ఋషులు వ్రాసిన శ్రుతులు సమయాచారాన్ని బోధించాయి. వీటి ప్రకారము పరమేశ్వరిని అర్చించటమే సమయాచారము. హృత్పద్మంలోనే పరమేశ్వరిని భావన చేసి, షట్చక్రాల లోనూ భావనోపనిషత్తులో చెప్పిన విధంగా అర్చన చెయ్యటమే సమయాచారము.



ఈ విధమైన సమయాచారము నందు ఆసక్తిగలది ఆ పరమేశ్వరి.

గురువు వద్ద మహావేధ అనే సంస్కారము పొంది షట్చక్రభేధనము, చతుర్విధైక్య సంధానము తెలుసుకుని, వాటి ప్రకారము దేవిని అర్చించటాన్ని అంతర్యాగము అంటారు. ఈ రకమైన అర్చనయందు దేవి ఇష్టపడుతుంది. అందుచేతనే ఆమె 'సమయాచార తత్పరా' అనబడుతోంది.

అంతఃపూజ శ్రేష్ఠము, స్మార్త పూజ ఉత్తమము, పౌరాణికపూజ మధ్యమము తాంత్రికపూజ అధమము అని చెప్పబడింది.

గురుకటాక్ష మహిమ వల్ల జనించిన మహావేధ కారణంగా భగవతి, సాధకుడి ఆధార, స్వాధిష్ఠాలను భేదించుకుని మణిపూరం చేరుతుంది. అక్కడ ఆమెకు అర్ఘ్యపాద్యాదులిచ్చి షోడశోపచార విధిని మానసికంగా పూజ చెయ్యాలి. అపుడామె అనాహతానికి చేరుతుంది. అక్కడ ఆమెకు ధూప, దీప, నైవేద్య, హస్తప్రక్షాళన వరకూ సేవ చెయ్యాలి. అప్పుడు దేవి విశుద్ధి చక్రంచేరి, సింహాసనారూఢయై చెలులతో ముచ్చటిస్తూ ఉంటుంది. అక్కడ దేవిని విశుద్ధి చక్రంలోని పదహారు దళాలలోని చంద్రకళలతో పూజ చెయ్యాలి. తరువాత ఆమెను ఆజ్ఞాచక్రం చేర్చి నీరాజనాదులచే సంతోషపెట్టాలి. తరువాత దేవి విద్యుల్లతవలె సహస్రారంలో ప్రవేశించి క్షీరసాగరం లోని మణిద్వీపంలో, కదంబవనంలోని చింతామణి గృహంలో సదాశివునితో కలిసి ఉంటుంది. అప్పుడు తెరను ప్రసరింపచేసి మరల దేవి మూలాధారం ప్రవేశించే వరకు సాధకుడు వేచి ఉండాలి. ఇది యోగసాధ్యము. సమయమత రహస్యము.

సమయాచారులకు బాహ్యపూజ లేదు. కాబట్టి హృదయమునందే ఆరాధింప బడిన భగవతి సాధకులకు ఐహిక ఫలం కూడా ఇస్తుంది.

**మాతృకాం వశినీయుక్తాం యోగినీభి స్సమన్వితామ్ ।**
**గంధాద్యాకర్షిణీయుక్తాం సంస్మరేత్రిపురాంబికామ్ ॥**

వశిన్యాది శక్తియుక్తము, యోగినీ గణసమన్వితము, గంధాకర్షిణీ సహితము, మాతృకారూపము అయిన త్రిపురాంబికను ధ్యానిస్తే విద్యాప్రాభవం కలుగుతుంది. దేవిని ఎర్రని కాంతి కలదిగా పూజిస్తే స్త్రీలోకం వశమౌతుంది. లఘుస్తవములో చెప్పినట్లుగా

**వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే**
**భక్తేభ్యో వరదాభయ పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్ ।**
**ఉజ్జృంభాంబుజ పత్రకాంతి నయన స్నిగ్ధప్రభాలోకనీం**
**యేత్వామంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః ॥**

చేతులయందు పుస్తకము, అక్షమాల, అభయవరద ముద్రలు ధరించి కర్పూరము మరియు మల్లెపూవువలె ప్రకాశించు ఆ దేవిని ధ్యానించినట్లయితే కవిత్వము సిద్ధిస్తుంది. అంబాస్తవంలో చెప్పినట్లుగా

**"యః స్ఫటికాక్షగుణ పుస్తక కుండికాఢ్యాం**
**వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రామ్ ।**
**పద్మాసనాం చ హృదయే భవతీముపాస్తే**
**మాతః స విశ్వకవితాం కిం చక్రవర్తీ ॥"**

చేతులయందు అక్షమాల, పుస్తకము, కమండలము ధరించి, పద్మాసనాసీనయై, శరత్కాల చంద్రబింబమువలె ప్రకాశించు దేవిని ఎవరైతే ధ్యానిస్తారో అతనికి ప్రపంచాన్ని సమ్మోహనం చేసే కవిత్వం సిద్ధిస్తుంది. ఇదే విషయాన్ని మార్కండేయుల వారు

**స్తుతా సంపూజితా పుష్పై ర్ధూపగంధాదిభి స్తథా ।**
**దదాతి విత్తం పుత్రాంశ్చ మతిం ధర్మే తథా శుభమ్ ॥**

**సా చింతితా చ విజ్ఞానం తుష్టా బుద్ధిం ప్రయచ్ఛతి ।**
**ఆరాధితాసైవ నృణాం భోగస్వర్గాన వర్గదా ॥**

**శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణా ।**
**సర్వస్యార్తి హరే దేవి నారాయణీ నమోస్తుతే ॥**

భక్తిచేత నమస్కరించినంత మాత్రము చేతనే దేవి మనకు శుభాలు కలుగ జేస్తుంది. సౌభాగ్యము, శుభగత్వము, సారూప్య సౌశీల్యాదికము ఆ దేవిని కీర్తించి నందువల్లనే కలుగుతాయి. పశు, పుత్ర, ధనలాభము దారిద్ర్య నాశనము, అభీష్టసిద్ధి కలుగుతాయి.



ఈ విధంగా సమయులకు అంతఃపూజయే ఐహిక ఆముష్మిక ఫలములు కూడా ఇస్తుంది.

**4. వామాచారము :** వీరికి వామకేశ్వర తంత్రం ప్రమాణ గ్రంథం. క్షీరసాగర మథనంలో పుట్టిన మద్యంతాగిన అసురలది వామమార్గం. అమృతాన్ని తాగిన దేవతలది సయమ మార్గంగా చెప్పబడ్డాయి. వామాచారులు ఇంద్రియ తృప్తిచే ఆనందాన్ని అనుభవించటానికి ఇష్టపడతారు. మనస్సు, శరీరము వేటితో తృప్తిపొందుతామో, అట్టివాటిచేతనే దేవి కటాక్షిస్తుంది అని వీరి నమ్మకము. వీరు పంచమకార పూజలు చేస్తారు. పశు, నర బలులు ఇస్తారు. వివస్త్ర అయిన కన్యను. కులకాంతను. అందమైన వేశ్యను దేవి స్థానంలో కూర్చోపెట్టి, మద్యం పూర్తిగా సేవించి ఆ స్త్రీతో సంభోగం చేస్తారు. ఇదే దేవిని తృప్తిపరచటానికి సులభమైన మార్గం అని వీరి తలంపు. బెంగాలు, బీహారు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో వీరు విస్తృతంగా ఉన్నారు.

మేరుతంత్రం వామాచారాన్ని పూర్తిగా ఖండిస్తోంది. వామమార్గం వలన సర్వనాశనం కలుగుతుంది. అజ్ఞానులు, అటవికులు ఈ మార్గాన్ని అనుసరిస్తారు. ఇంద్రియ తృప్తిచేత ఆనందాన్ని అనుభవించే వామాచారులు భ్రష్టులవుతారు అని చెప్పబడింది.

**మకారపంచకము :** పరమేశ్వరి అర్చనలో మకార పంచకము తప్పనిసరిగా ఉండాలి. మకారపంచకము అంటే తంత్రశాస్త్రాలలో

**మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైధున మేవ చ**
**శక్తిపూజా విధానాద్యైః పంచతత్త్వైః ప్రకీర్తితః**

ఈ మకార పంచకాన్ని వాడేటప్పుడు వాచ్యార్థాని బట్టి వస్తువులను వాడరాదు. అజ్ఞానులు బాహ్యార్థాన్ని గ్రహించి జుగుప్సాకరము, హింసాత్మకము అయిన పనులు చేస్తున్నారు. దానివల్ల భ్రష్టులవుతారు. శక్తి సంగమతంత్రంలో

| | | |
|---|---|---|
| బెల్లపు పానకము | – | మద్యము |
| తెలకపిండి, గారెలు | – | మాంసము |
| వెల్లుల్లి, తిత్తిడిపదార్థాలు | – | మత్స్యము |

గోధుమలు మినుములచే చేయబడిన పదార్థాలు - ముద్ర

భక్ష్యభోజ్యముల కలయికే - మైధునము

అని చెప్పబడింది. ఇది కౌళాచారము మహానిర్వాణ తంత్రంలో

**న మద్యం మాధవీ మద్యం, మద్యం శశికిరణ రసోద్భవం**
**కర్మాకర్మ పశూన్ హత్వా జ్ఞానఖడ్గేన చేశ్వరీ**
**మనోమీనం తృతీయే చ హత్యాసంకల్ప వాసనః**
**భక్ష్యభోజ్యాన్నం భక్ష్య మింద్రియనిగ్రహః తాం చతుర్థాం విజానీయాత్**
**హంసఃసోహం శివః శక్తిశ్చైవ ఆనందనిర్మలః పంచమీంతాం విజానీయాత్**

1. చంద్రబింబము నుంచి జాలువారు అమృతమే మద్యము.
2. కర్మాకర్మలను పశువులను జ్ఞానఖడ్గంతో సంహరించటమే మాంసము.
3. మనస్సే మత్స్యము దాని సంకల్పవాసనలను హరించుటయే మత్స్య సమర్పణ.
4. ఇంద్రియ నిగ్రహమే భక్ష్యభోజ్యాలు. ఇది ముద్ర
5. హంసస్సోహం అనే మంత్రార్థమయిన శివశక్తుల కలయికయే మైధునము.

ఇది సమయాచారము. అయితే జ్ఞాని అయినవాడు పరమేశ్వరిని పంచ పుష్పాలతో పూజిస్తాడు. అవి

**అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః**
**దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతః పరమ్ ॥**

పరమేశ్వరిని అర్చించేవాడు సత్త్వగుణాన్ని బాగా అలవాటు చేసుకోవాలి. అహింస, ఇంద్రియ నిగ్రహము. దయ, క్షమ, జ్ఞానము అనే ఐదు పుష్పాలతోను దేవిని అర్చించాలి. ఈ విషయాలు తెలుసుకుని పరమేశ్వరిని అర్చన చేసిన వాడికి ముక్తి లభిస్తుంది.



# 7. సమయమత రహస్యాలు

సమయమతంలో అనేక రహస్యాలున్నాయి. వాటిని వరుసగా చూద్దాం.

**1. శివశక్తులకు సామ్యము :** సమయాచారుల ప్రకారం శివశక్తులు ఐదు రకాలుగా సామ్యం (పోలిక) పొంది ఉంటారు. అవి

1. అధిష్ఠాన సామ్యము 2. అనుష్ఠాన సామ్యము 3. అవస్థాసామ్యము 4. రూపసామ్యము 5. నామసామ్యము

షట్చక్రాలలోని ప్రతిచక్రంలోనూ వీరికి ఈ ఐదు రకాల సామ్యము ఉంటుంది.

**ఆధార చక్రంలో :**

1. శివాశివులిద్దరూ ఆధారచక్రంలోనే ఉంటారు. కాబట్టి అధిష్ఠాన సామ్యము.
2. ఇరువురు జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. కాబట్టి అనుష్ఠాన సామ్యము.
3. ఇరువురూ లాస్యతాండవం చేస్తుంటారు కాబట్టి అవస్థా సామ్యము.
4. ఇరువురూ అరుణఛాయలో ఉంటారు కాబట్టి రూపసామ్యము.
5. వీరిరువురుకూ భైరవీభైరవులని లేదా నవాత్మ నవాత్మకుడు అనీ పేర్లు కాబట్టి నామసామ్యము చెప్పబడ్డాయి.

**స్వాధిష్ఠాన చక్రంలో :**

1. శివాశివులిద్దరూ స్వాధిష్ఠానంలో ఉంటారు కాబట్టి అధిష్ఠాన సామ్యము.
2. లోకాలను దహిస్తున్నారనుట అనుష్ఠాన సామ్యము.
3. మహాసంవర్తాగ్ని జ్వాలాశక్తిరూపంలో ఉన్నారనుట అవస్థాసామ్యము.
4. మహాసంవర్తాగ్నులు అనటంచేత రూప నామ సామ్యాలు చెప్పబడ్డాయి.

**మణిపూర చక్రంలో :**

స్వాధిష్ఠానంలో మహాసంవర్తాగ్నివల్ల దహనమైన లోకాలను శివాశివులు తమ అమృతధారలతో తడుపుతూ ఉంటారు. ఇక్కడ శివుడు మేఘరూపంలోనూ, దేవి సౌదామిని రూపంలోనూ ఉంటారు.

